# సమాలోచన

జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు విద్వాన్ [illegible]సు సీతారామశాస్త్రి

లోపల

1) ఉత్తర రామచరిత్ర - ఉపదేశ వైచిత్రి.

2) సాహిత్యంలో శకుంతలా పాత్ర పరిశీలనము.

3) నాటకరంగంలో విశ్వనాథ వైశిష్ట్యం.

4) డా॥ వాసా ప్రభావతిగారి 'అమ్మ బొమ్మ'

5) కావ్యాలంకార సంగ్రహము - సమాజ దర్పణము.

6) నారాయణదాసుగారి 'బాటసారి - వర్ణనా వైశిష్ట్యం.'

7) పుట్టంబుట్టిన తపసి.

1—7—81 సంచికలో వసుచరిత్ర - తెలుగుపద శ్లేష, పారిజాతాపహరణం - ప్రబంధ పారిజాతం, దిగంబర సాహిత్య పరిశీలన మొదలగునవి ఉంటాయి

చందా
సంవత్సరమునకు రు. 12—00.
అర్ధసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T. J College, Rajahmundry.

సంపుటము 4 రాజమహేంద్రవరము 16-6-1981 సంచిక


## ఉత్తరరామచరిత్ర - ఉపదేశవైచిత్రి

– డా. శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి

ఆర్షకవి వాల్మీకి హృదయాన్ని గ్రహించి సముచితంగా ఆవిష్కరించిన మహాకవులలో భవభూతి ప్రశంసనీయుడు. అతడు ఉత్తరరామకథని ఉత్తరరామచరిత్ర అనే నాటకంగా తీర్చిదిద్ది 'ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' అనే విఖ్యాతి నార్జించుకొన్నాడు.

కావ్యపరమార్థం రసానందజనకత్వమే అయినా దానితో పాటు ప్రతికావ్యమూ సామాజిక నైతిక పురోగతికి ఆవశ్యకమైన సందేశాన్ని తప్పక అందజేయాలి. ప్రాచీనాలంకారికులు కావ్యం వ్యవహారజ్ఞానాన్ని కల్గించాలనీ, కాంతాసమ్మితంగా ధర్మాన్ని ఉపదేశించాలనీ, చెప్పడంలో ఉపదేశ ప్రాముఖ్యం వెల్లడి అవుతోంది. పాశ్చాత్యసాహిత్య విమర్శకులుకూడా కావ్యంలో ఉపదేశ ప్రాముఖ్యాన్ని అంగీకరించారు. ఎమర్సన్ మహాశయుడు కవుల శక్తిసామర్థ్యాలు పాఠకులలో కల్గించే ఉత్తమచిత్త సంస్కారాన్ని బట్టి పరిగణింపబడతాయి అనే అభిప్రాయాన్ని Great poets are judged by the frame of mind they induce in us' అని వ్యక్తంచేశాడు. మాథ్యూ ఆర్నాల్డు ప్రభృతులు కూడా ఉపదేశ ప్రాశస్త్యాన్ని బహుధా ఉద్ఘాటించారు. ప్రాక్పశ్చిమ విపశ్చిదగ్రగణ్యుల ఆశయం ఉత్తరరామ చరిత్రలో నెరవేరినవిధం పరిశీలనార్హం.

మహాకవులు కావ్యాలలో సన్నివేశమూలంగాను సూక్తుల రూపంలోనూ ఎన్నో విషయాలు ఉపదేశిస్తారు. జగత్కల్యాణానికి వారి ఉపదేశం ఎంతో ఉపకరిస్తుంది. సమాజాన్ని సరియైన మార్గంలో నడిపించడమే వారి ధ్యేయం.

ఉత్తర రామచరిత్రలో భవభూతి ఉపదేశించిన విషయాలలో ధర్మతత్పరత, సేవకానురాగం, ఆదర్శ దాంపత్యం సంతానతత్త్వం, ఆర్యప్రవృత్తి, స్నేహస్వభావం, పూజ్యతా కారణం, గురుశిష్య స్వభావం–అనేవి ముఖ్యమైనవి. ఇందులో కొన్ని సూక్తుల రూపంలో వెలువడ్డాయి. మరికొన్ని ఉదాత్తమైన సన్నివేశాల్ని సమీక్షించడం వలన గ్రహింపదగినట్టివిగా కూర్పబడ్డాయి

ప్రజాపాలకులు ధర్మానుష్ఠాన విషయంలో వ్యవహరింపవలసిన తీరెట్టిదో నాయకుడైన రామచంద్రుని ముఖంగా బోధింపబడింది ప్రజల సంక్షేమం కోసం ప్రియతమములైన విషయాలనైన త్యజించడానికి ప్రభువు వెనుకాడకూడ దని భవభూతి ఉపదేశించాడు. నీవు బాలుడివి, రాజ్యంక్రొత్తది, ప్రజానురంజకుడవై వలధనమైన యశస్సు సంపాదించు అని వసిష్ఠుడు సందేశం పంపగా రా[...] చంద్రుడు దానికి–

"స్నేహం దయాం తథా సౌఖ్యం
యది వా జానకీ మపి
ఆరాధనాయ లోకస్య
ముంచతో నాస్తి మే వ్యథా"

అని అంటాడు. లోకారాధన కోసం స్నేహాన్నీ, దయనీ, సౌఖ్యాన్నీ, చివర సీతాదేవినైనా విడిచిపెట్టడానికి బాధ[...] పడ నని రాముడు పలుకడం వాల్మీ[...] బహుధా ఉగ్గడించిన 'రామో విగ్రహవాన్ ధర్మః' అనే వాక్యానికి వివర[...] ప్రాయంగా వుంది. సీత యొక్క పావిత్ర్యం, పాతివ్రత్యం బాగా దాశరథికి తెలుసు. కాబట్టి అతంకస్[...] రిత కఠోరగర్భ లక్షణాలు గల్గిన సీత[...] దయారహితంగా పచ్చిమాంసం తి[...] వానికి బలి ఇస్తున్నా నని రాముడు ఎంతో బాధపడతాడు. అయినా అతడు భార్యానురాగంకంటె లోకానురంజనవే ముఖ్య మని భావించాడు పరిపాలకుల[...] అంతటి ధర్మనిష్ఠులైనప్పుడే ప్రజల[...] కూడా ధర్మనిరతులవుతారు. 'యథా రాజా తథా ప్రజా' అని కదా ఆర్యోక్తి

యజమానులు సేవకుల విషయమై ప్రవర్తింప వలసిన పద్ధతిని భవభూతి ఎంతో మనోహరంగా సూచించాడు హనుమంతుడు తనకు చేసిన సాహాయ్యా[...]

కి సీత 'ఏవమ్ రనిర్విణ్ణ జీవలోక సము
ద్ధరణ గురూపకారీ మహాభాగో మారుతిః'
అని ప్రశంసిస్తుంది. చిరకాలంనుండే ఆక్ర
మింపబడ్డ నిర్వేదంతో వున్న జీవకోటిని
సముద్ధరించు మహోపకారి' అని హను
మంతుడు కీర్తింపబడ్డాడు. రాముడు
కూడా 'యస్య వీర్యేణకృతినో వయం చ
భువనాని చ' అని శ్లాఘిస్తాడు. హను
మంతుని పరాక్రమంచేత తామూ భువ
నాలూ ధన్యతగాంచేయట. ఈ సంభా
షణలలో పరిపాలకులు పాలితులని
ఎలా ఆదరించాలో భవభూతి మహాకవి
చక్కగా నిరూపించాడు. ఐశ్వర్యం
కాంక్షించే ప్రభువు సేవకు అని పుత్రుల
లె చూసుకోవాలనీ రాజు తుష్టుడైతే
ధనం మాత్రమే ఇస్తాడు కాని సేవకులు
సమ్మానింపబడితే ప్రాణాలర్పించియైనా
ప్రభువులకి ఉపకరిస్తారని నీతిశాస్త్రం
కూడా ఇలా చెబుతోంది

'పుత్రవల్లాలయే న్నిత్యం
యఇచ్ఛేచ్ఛ్రియ మాత్మనః
రాజాతుష్టోఽపిభృత్యానా
మర్థమాత్రం ప్రయచ్ఛతి
తేతు సమ్మానితా స్తస్య
ప్రాణైరప్యుపకుర్వతే'

ఉదాత్తదాంపత్యం ఎలా వుండాలో భవభూతి సీతారాముల దాంపత్యంలో నిరూపించినాడు. ఈ నాటకం ఆద్యంతమూ వారి దాంపత్య విశేషాన్నే అభివర్ణిస్తోంది. అరణ్యవాస సందర్భంలో శ్వాపదాశ్రయమైన ఘోరారణ్యంలో కూడా ఆ పుణ్యదంపతులు ఆనందాన్ని అనుభవించారు బిగిసడలని గాఢాశ్లేషంతో వాడీ వరుసా లేని మధుర సంభాషణలతో వున్న వాళ్ళకి రాత్రి తెలియకుండా తనంతట అదే గడచిపోయిందని రాము డిలా అంటాడు:

'కిమపి కిమపి మంద
మ్మందమాసత్తియోగా
దవిరళిత కపోలం
జల్పతో రక్రమేణ
అశిథిల పరిరంభ
వ్యాపృతైకైక దోష్ణో
రవిదిత గత యామా
రాత్రి రేవ వ్యరంసీత్.'

'రాత్రి రేవ వ్యరంసీత్' అనడంలో సీతారాముల అనుపమ దాంపత్యానుభవం అభివ్యక్తమైంది లోకంలో దంపతు లందరూ నిత్యమూ తమ జీవితాలని ఆ విధంగా ఆనందమయంగా గడపాలని భవభూతి ఆశంస నిద్రవస్తే సీత తలదిండు కోసం వెతుకుతున్నప్పుడు రాముడు 'రామబాహు రుపధాన మస్తు తే' అని తన కైదండ నందిస్తాడు రావణాపహృతయైన సీతకై రాముడు పొందిన యవస్థకి రాయికూడా ఏడుస్తుందనీ వజ్రాంతర్భాగం కూడా విచ్చుతుందనీ లక్ష్మణుడు 'అపి గ్రావా రోది త్యపి దళతి వజ్రస్య హృదయం' అని పేర్కొంటాడు. రామునికి సీతపై అనురాగం అంతటిది. రాముని వలన సీతా పరిత్యాగ వృత్తాంతం విన్న వాసంతి రామునితో నీకు కీర్తి ముఖ్యమా? అలాగయితే సీతా పరిత్యాగానికి మించినఅపకీర్తి ఇంకోటి వుందా అని ప్రశ్నించినప్పుడు అదృశ్యంగాఉన్న సీత సంతోష పడదు సరిగదా వాసంతిని నీవే భయంకరురాలవు. కఠినురాలవు. బాధపడుతున్న రాముని మరింత బాధిస్తున్నావని 'సఖి వాసంతి! త్వమేవ దారుణా కఠోరా చ య దేవ మార్యపుత్రం ప్రదీప్తం ప్రదీపయసి' అని మందలిస్తుంది దంపతుల అనుబంధం ఎలా ఉండాలో భవభూతి ఈవిధంగా నిరూపించడమేకాకుండా దాంపత్యతత్త్వాన్ని రామునిద్వారా ఇలా చెప్పించినాడు.

'అద్వైతం సుఖదుఃఖయో
రనుగతం సర్వాస్వవస్థాసు యు
ద్విశ్రామో హృదయస్య యత్ర
జరసా యస్మిన్న హార్యో రసః
కాలే నావరణాత్యయా త్పరిణతే
యత్ స్నేహ సారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య
కథమ ప్యేకం హి తత్ప్రార్థ్యతే'

సుఖదుఃఖానుభవాల్లో దాంపత్యం దంపతు లిద్దరిలోనూ ఒకే విధంగా వుంటుంది. సర్వావస్థలయందు వారిని వెన్నంటే వుంటుంది. హృదయానికి ఊరట కల్గిస్తుంది. ముసలితనం ప్రాప్తించినా పరస్పరప్రీతి హరింపశక్యం గాదు. కాలంగడుస్తున్నకొలదీ ప్రతిబంధకాలు తొలగడంచేత స్నేహసారంపరిపక్వమై స్థిరమౌతుంది. సార్వకాలిక పరమ సత్యమైన ఈదాంపత్యసూక్తం నిత్యం పరింపదగ్గది.

భవభూతి సంతానతత్త్వాన్ని తమసా పాత్రముఖంగా ఉగ్గడించిన తీరు పరమ రమణీయంగావుంది. సంతానమంటే పరమ స్నేహంవలన దంపతుల అంతఃకరణ తత్త్వంయొక్క ఆనందగ్రంథి అని ఇలా

'అంతఃకరణ తత్త్వస్య
దంపత్యోః స్నేహసంశ్రయాత్
ఆనంద గ్రంథి రేకోఽయ
మపత్య మితి పర్యతే'

చెప్పబడింది. ఇది మహాకవి భవభూతి యొక్క బహులోకజ్ఞతని సూచిస్తోంది

ఆర్యవృత్తిని భవభూతి అభివర్ణించిన పద్ధతి అత్యంత మనోహరంగావుంది వనదేవత ఆదరించిన రీతికి సంతుష్టురాలై ఆత్రేయి ఆవనదేవతతో ఇలా అంటుంది

'ప్రియప్రాయావృత్తి
ర్వినయ మధురో వాచి నియమః
ప్రకృత్యా కల్యాణీ
మతిరనవగీతః పరిచయః
పురో వా పశ్చాద్వా
తదిద మవిపర్యాసిత రసం
రహస్యం సాధూనా
మనుపధి విశుద్ధం విజయతే.'

ఉత్తములనడవడి ప్రియంగా వుంటుంది, మాట నియమబద్ధమై మధురంగా వుంటుంది తలంపు సహజంగానుభాస్పదంగా వుంటుంది, వారి పరిచయం అనిందితంగా వుంటుంది. వారి ప్రియత్వం ఎట్టిమార్పూ చెందదు. వారి తత్త్వం సహజంగా శుద్ధంగా వుంటుందని భావం, ఈవిధమైన ఉత్తమ ప్రవృత్తిని పాఠకలోకం అలవరచుకోవాలని భవభూతి చమత్కారంగా సూచించిన పద్ధతి నిత్యస్మర్తవ్యం.

ఉత్తరరామచరిత్రలో ఉత్తమస్నేహస్వరూపం హృదయంగమంగా వివరింపబడింది పరస్పరస్నేహపాశబద్ధులైన లవచంద్రకేతువులని చూసిన సుమంత్రుడు స్నేహం నిష్కారణమైన ఆత్మీయతని కల్గిస్తుందనీ దానికి ప్రతిక్రియ ఉండదనీ ఆ స్నేహాత్మక తంతువు ప్రాణుల లోపలి మర్మాలని కట్టేస్తుందని ఇలా అంటాడు.

'అహేతుః పక్షపాతో య
స్తస్య నాస్తి ప్రతిక్రియా
సహి స్నేహాత్మక స్తంతు
రంతర్మర్మాణి సీవ్యతి '

అనంతరకథలో లవుని చూసిన పిమ్మట హృదయసంపదనాన్ని పొందిన రాముడు కూడా స్నేహతత్త్వాన్ని ఇలావివరిస్తాడు

'వ్యతిషజతి పదార్థా
నాంతరః కోఽపి హేతుః
న ఖలు బహిరుపాధీన్
ప్రీతయస్సంశ్రయంతే
వికసతి హి పతంగ
స్యోదయే పుండరీకం
ద్రవతి చ హిమరశ్మా
వుద్గతే చంద్రకాంతః'

స్నేహం ఒకానొక గూఢహేతువై పదార్థాలని అన్యోన్య సంలగ్నం చేస్తుంది, స్నేహాలు బాహిరాలైన హేతువులపై ఆధారపడవు. సూర్యు డుదయింపగానే పద్మాలు వికసిస్తాయి. చంద్రు డుదయింపగానే చంద్రకాంతమణి కరగిపోతుం దని శ్లోక భావం. ఈ విధంగా స్నేహంయొక్క మౌలిక రహస్యాన్ని ప్రసిద్ధాలైన రెండు ఉపమానాలతో భవభూతి రామపాత్ర ద్వారా లోకాని కుపదేశించిన విధం శిరోధార్యం.

అరుంధతి సీతాదేవిని కొనియాడిన సందర్భంలో 'గుణాః పూజాస్థానం గుణిషు న చ లింగం న చ వయః' అని చెప్తుంది లోకంలో ఒకవ్యక్తిని పూజించాలంటే ఆవ్యక్తిలోని గుణాలే పరిగణనీయాలు. స్త్రీపుం విభేద గానీ వయః పరిమితి కానీ కాజాలవని భావం. గుణాలని బట్టే వ్యక్తులని ఆరాధించాలన్న భవభూతి ప్రతిపాదన దేశంలోని జాతిమతాదిక వైషమ్యాల్ని పారద్రోలడానికి ఎంతో ఉపకరిస్తుంది.

ఆత్రేయి వనదేవతతో లవకుశుల అధ్యయన కౌశలాన్ని సహృదయతతో అభినందిస్తూ భాషించిన సందర్భములో గురుశిష్యస్వభావం తీరు ఎలావుంటుందో ఈవిధంగా సహజసుందరంగా వివరింపబడింది.

'వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం
యథైవ తథా జడే
న హి ఖలు తయో ర్జ్ఞానే శక్తిం
కరో త్యపహంతి వా
భవతి చ తయో ర్భూయాన్ భేదః
ఫలం ప్రతి తద్యథా
ప్రభవతి శుచి ర్బింబగ్రాహే మణి
ర్న మృదాం చయః'

గురువు ప్రాజ్ఞునికీ జడునికీ విద్యని సమంగానే ఇస్తాడు. విషయ గ్రహణంలో ఒకనికి శక్తినివ్వడంగానీ ఒకనికి తగ్గించడం కాని చెయ్యడు. అయినా ఫలం విషయంలో భేదం సమధికం. బింబాన్ని గ్రహించడంలో మణి సమర్థమైనది. మట్టిముద్ద కాదుగదా అని శ్లోకభావం. గురువు శిష్యు లందరినీ సమభావంతో చూడాలనీ విజ్ఞాన సముపార్జన లోని వ్యత్యాసానికి కారణం తమ శక్తిసామర్థ్యాలే కాని ఉపదేశంలో గురువుల పక్షపాతం కాదని శిష్యులు గుర్తించాలనీ భవభూతి ఈశ్లోకంలో వ్యంగ్యంగా హెచ్చరించినాడు. ఇందలి శిష్యోపాధ్యాయ సంబంధనిరూపణం అనుత్తమం.

ఉపదేశవాక్యాలూ చాలా అనర్ఘాలైనవి. వానిని జీర్ణించుకొని జీవితాలు సుఖవంతా లవుతాయి. కాబట్టి మహాకవులు తమ కావ్యాల్లో ఎన్నో సార్వకాలిక సత్యాలని ఉపదేశించారు. ఉత్తరరామచరిత్రలోని సన్నివేశరసాలంకారాదులనే కాకుండా అందులో మధురమైన ఉపదేశాన్ని కూడా తప్పక పరిశీలించి పరిగ్రహించాలని పాఠకలోకాన్ని భవభూతి హెచ్చరించాడో అన్నట్లు ఆ మహాకవి సూక్తిప్రాశస్త్యాన్ని ఇలా ఉద్ఘోషించాడు.

'కామాన్ దుగ్ధే విప్రకర్ష త్యలక్ష్మీం
కీర్తిం సూతే దుష్కృతిం యా హినస్తి
తాంచా ప్యేతాం మాతరం మంగళానాం
ధేనుం ధీరాః సూనృతాం వాచ మాహుః'

హితోక్తి కామధేనువువలె కోర్కెలని తీరుస్తూ దుఃఖాన్ని తొలగిస్తూ కీర్తిని కల్గిస్తూ కలుషాలని నశింపజేస్తుం దని భావం.

ఇటువంటి ఉపదేశ రత్నాలకి ఉత్తరరామ చరిత్ర ఒక మహాసాగరం. ఆ మధురనాటకాన్ని సూక్తి సుధాకరంగా సంతరించిన మహాకవి భవభూతి ధన్యచరిత్రుడు.

— •—

# సాహిత్యంలో శకుంతలా పాత్ర పరిశీలనము

- శ్రీమతి డా. పూసపాటి భాగ్యలక్ష్మి, ఎం ఏ., పిహెచ్.డి.

మానవ జీవితపు ప్రతి అధ్యాయము నందును వివిధ రూపములను సంతరించుకొని తన ప్రభావమును చూపగల మహిమాన్విత - స్త్రీ. ఇట్టి మహనీయ యగు మహిళామూర్తి ప్రస్తావనముగాని, ప్రాభవముగాని లేని కావ్యము లరు దని చెప్పవచ్చును.

ఆదినుండి నేటివరకు తెనుగు సాహిత్యమునందు అసంఖ్యాకము లగు స్త్రీ పాత్రలు చిత్రితములు. ఇందధికము సంస్కృతమున జన్మించి తెలుగున ఆకృతి గాంచినట్టివి. ఇట్టి కోవకు చెందిన శకుంతల పాత్రను పరిశీలించుట ప్రస్తుతము.

శకుంతల ప్రశాంత వాతావరణ విలసిత ముగ్ధకుసుమము. మాతృసంబంధమగు దివ్యతేజస్సు, పితృ సంబంధమగు క్షాత్ర వర్చస్సు, రక్షణ ప్రదాతలగు శకుంతముల కరుణా పయస్సు, ఆశ్రయదాత యగు కణ్వుని నిర్మల నైష్ఠికత్వము-వీని సత్ సమ్మేళనముచే ఆకృతిగాంచిన అమృతరేఖ.

శకుంతల వేదవ్యాసుని కావ్యమున పుట్టి పెరిగిన తాపసకన్యయే యైనను కవికుల గురువగు కాళిదాసుని కావ్యకళా సుధాలవాలియందు జలకములాడి ఒక వింత సోయగమును, దానిని మించిన ప్రాభవమును సంతరించుకొన్నది. వీరి ద్దరి ఒద్దికలో పెరిగి నన్నయగారి పెంపకమున వ్యక్తిత్వమును పెంపొందించుకొనినది. కాని కాలప్రభావమున అంతటి మహోన్నత వ్యక్తిత్వమును కోల్పోయి, కేవలము నామమాత్రముగ నిలచి, చెలు లెల్లాడించిన అట్లాడు మర బొమ్మయైనది. ఆమె స్వభావమునందలి ముగ్ధత్వమునకు శృంగారము అను మేలి ముసుగు నలంకరించినను, కవితాపరసీమ యగు తాపసీలేమగ, నిత్యజీవితమునకు సన్నిహితమగు తెలుగుభామగ తీర్చిదిద్ది తన తృష్ణను తీర్చికొనినాడు కృష్ణకవి.

## సంస్కృత భారతము - వేదవ్యాసుడు

శకుంతలా చరితమును ప్రప్రథమముగ వర్ణించిన మహాకవి వేదవ్యాసుడు. సంస్కృత భారతమునందు ఆమె వర్ణన మీవిధముగ కలదు.

‘ .. కన్యాశ్రీ రివరూపిణీ
నిశ్చక్రామాశ్రమాత్తస్మా
త్తాపసీ వేషధారిణీ
విభ్రాజమానవపుషా తపసా చ దమేన చ
రూపయౌవన సంపన్నా .. ’

శకుంతల అవివాహిత యగు కన్యయే నను తపోదమములు పొందిన తాపసిగ కవి నిరూపించినాడు. తాపసీ వేషధారిణి యైనను ఆమె రూపుదాల్చిన కాంతిపుంజము. విద్యుల్లత వంటి ఈ సౌందర్యము దుష్యంతుని కన్నులకు మిరుమిట్లు కొలిపి, ఇట్టి సౌందర్యమునకు ఈ వేషమేమి? అనుకొనునట్లుగ చేసినది.

ఆశ్రమవాసిని యగు శకుంతల దుష్యంతుని పిలుపువిని కుటీరము నుండి వెలుపలకు వచ్చి దుష్యంతుని చూచి అర్ఘ్య పాద్యాదుల నిచ్చి ఆశ్రమధర్మము నెరపినది. కుశలప్రశ్నలు వేసి తనతండ్రివచ్చువరకును వేచియుండుమని కోరినది. దుష్యంతుడు ఆమె అభిజాత్యము గురించి తెలిసికొన నిచ్చగింపగా జంకుగొంకులు లేక, తనకు శ్రుతపూర్వ మగు విషయమును అతనికి విదితము చేసినది. పరపురుషుని యెదుట, అందును ఒక ప్రభువు నెదుట అవివాహిత యగు కన్య తన తల్లిదండ్రుల విషయమును ఇట్లు విపులముగ చెప్పుట కొంత అనుచిత మని పించును. ఈకథనము వినినపిమ్మట దుష్యంతుడు ఆమెను తనకు భార్య కమ్మని అడిగినాడు. అంత శకుంతల ఫలాహారి యగు కణ్వుడు సుముహూర్తములో తన్ను అర్పించునని బదులిచ్చినది. ఇది శకుంతలకు కణ్వునిపై గల భక్తి గౌరవములకు సూచన, కాని కామార్తుడగు రాజు ఆత్మయే బంధువు, మిత్రుడు, ఆశ్రయవస్తువు, అని వివరించి గాంధర్వమునకు ఆమెను బలవంత పెట్టినాడు. అప్పుడు శకుంతల 'గాంధర్వవివాహము ధర్మసమ్మతమైనచో, ఆత్మార్పణాధికారము ఆత్మకుండినచో, తాను అతనిని స్వీకరించుననియు, కాని తన కుమారుని యౌవరాజ్యపట్టాభిషిక్తుని చేయవలె ననియు, పలికినది ఇది శకుంతల ధర్మప్రియత్వమునకు కొక మచ్చుతునక. వివాహము సత్సంతానము కొరకు, వంశరక్షణము కొరకు అను ధర్మశాస్త్ర విషయము ఆమె మనసునందుండుట యే పై కోరిక యందలి అంతరార్థము ధర్మశాస్త్ర సమ్మతమైనచో తన్ను వివాహమాడుమని పలుకుట, ఆమె జీవితములో దానికిచ్చిన విలువలను తెలుపుచున్నది

దుష్యంతుడు ధర్మసమ్మతమని బలవంత పెట్టుటచే గాంధర్వమునకు అంగీకరించినది - కాని మనసునా అవ్యక్తమైన జంకు గొంకులు ఆక్రమించినవి. చివరకు కణ్వుడు ఆమె ప్రవర్తనము ధర్మసమ్మతమని ఆశ్వాసించి, ఆశీర్వదించు వరకు స్తిమితపడలేక పోయినది. కరుణతో వరములిచ్చుటకు కణ్వుడు సిద్ధపడగా 'పౌరవులు ధర్మబద్ధులై రాజ్యపాలకులు కావలె నని' కోరినది. ఇది శకుంతల భర్తశ్రేయస్సు మనస్సునందుంచుకొని కోరినకోరిక.

కణ్వాదేశముపై పుత్ర సహితయై దుష్యంతుని సభకువచ్చి తన్ను గూర్చి ఎఱుకపరచినది. తన్ను గుర్తించియు, గుర్తించని యట్లు ప్రవర్తించు భర్తను చూచి అత్యంత కుపితయైనది. దారుణాఖండల శస్త్రతుల్యము లగు వాక్కులతో, పతివ్రత యగు భార్యను - గుణవంతుడగు పుత్రుని, సత్యవాక్యమును, పరిగ్రహించుట వల్లను పరిత్యజించుట వల్లను నుప్పతిల్లు లాభనష్టములను శ్రుతిస్మృతి పురాణేతిహాస వాక్య ప్రమాణములతో విపులముగ నుపన్యసించినది. చివరకు. తన్ను పరిత్యజించినను కుమారుని మాత్రము విడనాడవల దని పలికి ఆతని వంశరక్షణము కొఱకు, తన బిడ్డ భవిష్యత్తుకొఱకు యత్నించినది అప్పటికిని చలింపని దుష్యంతునిచూచి భర్త కపటవర్తనముచే వంచనకు గురియైన క్షత్రియకాంత ఆవేశము ఈ సందర్భమున ఆమె చిత్తములో చిందులువేసినది. కాని పతివ్రతా ధర్మమును మరచి, తపోదమాది సంపన్న యగు శకుంతల భర్తను నిందుకొలుపున, వ్రీడాకరముగ నిందించినవిధము మాత్రము వ్యాసశకుంతల యందు ఒక లోపమని చెప్పక తప్పదు శమదమాది ప్రవృత్తి గలదిగా మొదట వర్ణింపబడిన శకుంతల చివరకు 'పుంవత్ ప్రగల్భ'గ మారినది చివరకు ఆకాశవాణి పలుకులచే దుష్యంతుడు శకుంతలను, పుత్రుని పరిగ్రహించినాడు.

- ఇది వ్యాసులవారు శకుంతలా చరిత్రమును వివరించిన విధము.

## అభిజ్ఞాన శాకుంతలము కాళిదాసు.

సంస్కృత భారత కల్పతరువునుండి, ఇతివృత్తమును స్వీకరించి కవికుల గురువగు కాళిదాసు 'అభిజ్ఞాన శాకుంతలము' ను నాటకముగా రూపొందించినారు. భారతమునందలి శకుంతల ప్రకృతియే ఇందు పూర్తిగా మారిపోయినది. కవికుల గురువు శకుంతలా చిత్రణమున కూర్చిన ప్రత్యక్షరము అణిముత్యమై ఆ కావ్యము ఒక అమూల్యాభరణముగ మారినది. శకుంతల జన్మమున దేవక్షత్రియ బీజము లున్నను కృత్రిమవాతావరణ సహజము లగు మిథ్యానాగరకతలు, లజ్జాభినయములు ఎరుగక పెరిగిన స్నిగ్ధ ఆకృతిగల ప్రకృతి పుత్రికయైనది. ఆమె ఆశ్రమములో కొమ్మలలో కొమ్మ హరిణములలో హరిణము. వృక్షలతాదులయందు ఆమెకుగల స్నేహము సోదర స్నేహమను అంతరువును దాటి ఆత్మసాదృశ్యమును పొందినది - ఇట్లు ఈ నాటకమున ప్రకృతితో తాదాత్మ్యమునందిన అతిముగ్ధ. ఇట్లు శకుంతలా చిత్రణమునకు పునాదులు ప్రథమాంకమునందే వేయబడినవి.

శకుంతలా దుష్యంతుల ప్రథమపరిచయము కవికుల గురువగు కాళిదాసుని కవితాకౌశలమునకు కాణాచియైనది ఈ కావ్యమున మొట్టమొదటగ చెలులతో విస్రంభముగ సరససల్లాపములాడుకొనుచు వృక్షసేచన మొనర్చు శకుంతలను, కణ్వదర్శనార్థమై వచ్చి, ఆపన్నరక్షణమను వ్యాజమున భ్రమరపీడనము తొలగించుట కుద్యమించిన దుష్యంతునకు కవి ప్రథమ సమావేశము కలిగించినాడు. దుష్యంతుని చూచిన శకుంతల తపోవన విరుద్ధమగు వికారమునకు లోనైనది. ఆమె తన భావములకు తానే చకితయై, పులకితయై, విస్మితయై సుమధురక్షీరఖండన్యాయమున కరగిపోయినది. ఈ పట్టున ఆమె హావభావములు, పరునితో మాట కలపని తీరుతెన్నులు, అతనిపైగలిగిన అనురాగమును, మృదుమధురముగ, కులకన్యోచితముగ, సౌశీల్యచిహ్నముగ అసదృశముగ కవి చిత్రించినాడు, విరహదూయమానమానస యగు శకుంతల ప్రణయలేఖ వ్రాయ నుద్యమించుట - ఆమె యందలి పతనావస్థ

నిదర్శనము. కాలములను కాలద్రోసికొ
ప్రవహించునదివలె ఆమె ప్రగాఢ ప్ర
యము కులకన్యోచితములగు అవధుల
క్రమించి యత్నించినది. ఫలిత
గాంధర్వ వివాహము. దుష్యంతుడు నగ
పోయినను శకుంతల మనోవీథి యంద
మనోనాయకుని మన్ననలె వెల్లువలై ప్ర
హించుచున్నవి. ప్రణయాద్వైత భా
నిమగ్నయై బాహ్యప్రపంచమునే మరి
నది. దుష్యంత నివిష్టబుద్ధియై ఆమె వాకి
నిలచిన దుర్వాసుని చూడలేదు. అత
శాపమును వినలేదు. శృంగారరసమున
దోహదకారి యగు ఆమె చిత్తవృ
తత్కాల ధర్మాచరణకు ప్రతిబంధ
మైనది. ఇది శకుంతలా చరితమున ఆ
యొక పతనావస్థ. అందువలన దుర్వాసు
శాపము కృతకమైనట్లు కాక, మా
స్వభావని హితమైన విషబీజమును ఖండి
చుట కేర్పడినట్లు కవి దానిని అనుబం
చినాడు. చతుర్థాంకము శకుంతలకు ఆ
మముపై గల ప్రేమకు నిదర్శనము. ఆ
మధురస్మృతులలో శకుంతల తన ధ
మును సర్వస్వమును మరచినదో ఆ
భర్తృగృహమునకు పోవుచున్న సమయ
వచ్చినది. కాని చిరకాల స్నేహము
తపోవనమును విడిచిపోవుటకు ఆమె
కాళ్ళాడుటలేదు. ఈ సమయమున క
శకుంతలా హృదయమునందలి కోమలత
మును, కరుణమును చిత్రించినాడు

గుర్విణియగు శకుంతల రాజాస్థానమ
నకు వచ్చినది. ఆమె ప్రేమకు ఆఘాతము
కలిగినది కలలలో కరగిపోవుచున్న ఆమె
దారుణ శరాఘాతము పొందిన కురం
యైనది. నవమాలిక పై నిప్పులవర్షము కు
సినయట్లు, 'చేరదీసి' ప్రేమించి లాలి
చిన మృదుల హస్తముచేతనే దెబ్బతి
నట్లుగ మారినది, ఆమె స్థితి. అటు కణ్వా
శ్రమమున స్థానము కోల్పోయినది. ఇటు
పతిచే నిరాకరణము పొందినది. నిలువనీడ

లేక పరీక్షార్థము విప్రులయింట నుండుట తన్న మరణము మేలుగ తలచి 'దేహిమే వివరమ్' అని భూదేవిని ప్రార్థించినది.

సప్తమాంకము శకుంతలాచరితము యొక్క చరమవికాసమును ప్రదర్శించుచున్నది. ఈ స్థితిలో ఆమె దుష్యంతుని యందు అనురక్తయే కాని కామాంధ కాదు. అభిమానవిలాసవతియే కాని మూర్తీభవించిన మాతృమూర్తి. పుత్రసామీప్యమున దుష్యంత విరహమును మరచినది. మాసినవస్త్రము, నిష్ఠురనియమపాలనము కృశించిన ముఖము ఏకవేణి - ఇట్లు తన శరీరము తపస్సలిలముచే సమ్మార్జనమొనర్చుకొనిన వినూతన తేజము, మూర్తీభవించిన నైష్ఠిక సౌందర్యము ఆమెయందు చిత్రించినాడు కవి. ప్రథమాంకము నందలి ప్రభాతతరళజ్యోతి, చరమాంకమున 'చతుర గంభీరాకృతి' మారినది. అనగా శృంగార మాధారముగ పవిత్రమగు గృహమేధ ధర్మమును ప్రదర్శించినాడు కవి. - ఇది కాళిదాసుని శకుంతల తీరుతెన్నుల చిత్రణము.

ఆంధ్రమహాభారతము నన్నయ -

సంస్కృతభారతమునందలి శకుంతలోపాఖ్యానమున సాగినతీగలో అందందు పూచిన పూవులవలె; పండిన పండ్లవలె పొందుపడి అందగించునట్లు కొన మెరుపుల వంటి చినచిన్న మార్పులను అనుసంధించినాడు నన్నయ మొట్టమొదటగా శకుంతలను.

'. తన్వి బయోజదళాయతాక్షి సం
కుల మిళితాళి నీల కన్యకం గనియె .'

భార. ఆది ప. ఆ4. ప 25 'మనోజ రాజ్యలక్ష్మియుం బోని దాని సర్వలక్షణ లక్షితంబు లయిన సర్వావయవములు చూచి' అని వర్ణించినాడు.

మూల భారతమునందు 'విభ్రాజమానవపుషా తాపసీవేషధారిణీ' అని వర్ణింపబడిన శకుంతల సౌందర్యమును నన్నయ ఇట్లు మార్చినాడు. ఫలసమీకరణార్థము వనమునకు వెడలిన కణ్వుడు వచ్చునంతలో గాంధర్వమునకు, సిద్ధపడిన దుష్యంతుని తొందరపాటునకు కారణము శకుంతలసౌందర్యముకనుక మనోజ రాజ్య లక్ష్మియగు అట్టి శకుంతలయొక్క సౌందర్యమును ముందు ముందుగా ఆవిష్కరించినారు.

'శకుంతలయు అనంత విలాసంబున జయంతుండ పోని దుష్యంతుని నెఱింగి ...' అని కలదు ఇది అమూలకము శకుంతల కితః పూర్వమే దుష్యంతుని ఆభిజాత్య పరంపరం, ప్రాభవ సంపద, మొదలగు వానిని గూర్చిన సుపరిజ్ఞానము ఉండి యుండ వచ్చునని నన్నయ భావనగా తెలియుచున్నది ఇంకను ఆతని గూర్చి వినుటయో, చిత్తరువులు చూచుటయో జరిగి యుండ వచ్చును. అందువలననే వెంటనే దుష్యంతుని గుర్తింపగలిగినది అనగా దుష్యంతుని గుణ గణములను, వంశప్రశస్తిని - అన్నింటిని తెలిసికొని అతడు ఉత్తమ పురుషుడని తన తండ్రి కిష్టుడని తెలిసికొనియే, ఆతనిచే ప్రార్థింపబడి వివాహమునకు లొంగిపోయినది. అంతే కాని కాళిదాసు శకుంతలవలె ప్రథమ దర్శనముననే చిత్తవికారమునకు లోనై ఆతని మాటలకు వశవదయైనట్టిది కాదు అను ప్రౌఢత్వమును నన్నయ ఈ పాత్రకు కల్పించినాడు.

(సశేషము)

# గురుస్మృతి

- శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి.

('కవిపాదుషా' పువ్వాడ శేషగిరిరావు గారి ఆకస్మికమరణమును పురస్కరించుకొని)

* 'గురుదేవుండు పువ్వాడ శేషగిరి నా
కున్, వాని వాత్సల్యమే
దుర దృష్ట్యైభవసారమేను వినుతిం
తున్ కావ్యనిర్మాణ చా
తురిలో వానికి సాటివచ్చుకవి యెం
దున్ లేఁడు, తద్గాత్రమా
ధురిఁ జెప్పందరమా నెఱీ' యంచువిలపిం
తున్ శిష్యుఁడన్ సద్గురూ!

* మదినాత్మీయత చిప్పిలంగ నెపుడున్
'మాలక్ష్మణస్వామి'యం
చెదిమోపల్కెడివాఁడవీవు ఘనసా
హిత్యంబు దీపింప, నీ
పదపద్మంబులె నమ్మి కొల్చుటఁ గవి
త్వంబబ్బె నాకంచు నే
నెదలో నెంచెద, నింకనీదు ఋణమే
నేరీతిఁ దీర్తున్ గురూ!

కవితాశిల్పమునందు నీకు సరితూఁ
గన్ జాలువాఁడెవ్వఁడీ
భువిలోనన్ గనరాఁడు, నిద్దమగు సొం
పుల్ వంపులన్ నింపు నీ
కవనప్రోజ్జ్వల భవ్యసౌధముల సం
ఖ్యాకంబులై యొప్పు నీ
కివియే ఓ కవిపాదుషా! కొనఁగదే
స్మృత్యంజలుల్ సద్గురూ!

* షాజహాను కట్టించిన తాజమహాలు
పాలరాతిది కాన నశ్వరము సుమ్ము,
నీరచించిన యా 'తాజి' నిల్చుసతము
అక్షరశిలావి నిర్మితం బగుటకతన!

* ఆ'కవి సార్వభౌమ' బిరు
దందినవార లనేకులీ భువిన్
నాకగుపించుచుండిరి, జ
నంబులు మెచ్చి యొసంగినట్టి నీ

డా 'కవిపాదుషా' బిరుద
మన్నివిధంబుల నద్వితీయుడవై
శ్రీకరమూచు నీకొక వి
శిష్టతఁ జేకురఁజేసె సద్గురూ!
* అంతేవాసుల నగ్రగణ్యుఁడని న
న్నాశీర్వదింపంగనే
సంతోషింపుచుఁ దోడివారలకు ని
చ్చల్ చెప్పి గర్వింతునీ
స్వాంతంబందున నన్నుఁ బుత్త్రసముగా
భావించి, మన్నించు ని
న్నెంతే భక్తిని నిల్పుకొందు నిటునా
హృత్పీఠిపై సద్గురూ!
* బాపురె! మొన్న ఢిల్లిదర
బారునవింటిని, వెళ్ళితిర్గిరా
కోపుదు వంచు లేచియిటు
లుంటిని, అక్కడనుండియే యెటో
మాపులకందరానియొక
చోటికిఁబోయితివంట, న్యాయమే?
ఈపయి నీవులేని బ్రతు
కేటికి నాకిఁక, కూటికా? గురూ!
* వశ్యము శ్రోత్ర సంచయ మ
వశ్యము నీగళమెత్త, శ్రవ్యమున్
దృశ్యముఁ జేసి చూపు కవి
ధీరుఁడవీవు మహానుభావ! సా
దృశ్యము నీకుఁ దక్కిన క
వీంద్రుల కింతయు లేదు, మాకు నై
రాశ్యమునే మిగిల్చితి, ని
రాదృతి చెల్లుటయ్యె? సద్గురూ!

— ‥ —



# నాటకరంగములో విశ్వనాథ వైశిష్ట్యం

(గతసంచిక తరువాయి)

కె. వి. రంగనాయకి, ఎం. ఏ.

త్రిశూలము - ఈ నాటకము కేవలము వీరశైవ సిద్ధాంతమునకు ప్రతీక. యాథార్థమునకు ఇది ప్రకరణము కావలయును కాని 'నవ్యలక్షణముల మిళితమై ఇది ప్రాచీనాలంకారికుల ప్రకరణపదమును పరిత్యజించి నాటకముగానే పరిగణింపబడినది నవ్యుల దృష్టిలో. దీనిలో 10 అంకములు గలవు రసమునుగూర్చి యిదమిత్థముగా నిరూపింప వీలులేకున్నది భక్తియనుటకు వీలుపడదు. కేవలము వీరమనుటకు వీలులేదు భక్తి వీరములు రెండు సమానముగా నున్నవి. ఒక దృష్టితో చూచిన రెండునూ అంగములుగానే భాసించును. అట్లే రెండూ అంగిగానున్నవి.

ఇందు వర్ణితమైనభక్తి సాత్త్వికభక్తి కాదు. కేవలము తామసము బసవని మహిమలు చాలచిత్రములుగ వర్ణింపబడినవి. ఇందులో బిజ్జలుడు రాజు. బసవడు మంత్రి జగదేవుడు రాజకుమారుడు. ఈ మువ్వురూ ఈ నాటకమున కత్యంత ముఖ్య పాత్రలు నామకరణమునందొక విశేషమున్నది. సామాన్యముగా వెనుకటి మహాకవులు కథావస్తువు ననుసరించియో, నాయికా నాయకుల నామములనో తమ నాటకములకు నామములు చేసిరి. అభిజ్ఞాన శాకుంతలమ్, మాలవికాగ్నిమిత్రమ్ స్వప్నవాసవదత్తమ్ ఇత్యాదు లిందు కుదాహరణములు

ఈ నాటకమునకూడ నామకరణ విషయము ప్రాచీనపద్ధతి నుండే సాగినది. ఇందలి ప్రధానాంశము వీరశైవమత ప్రతిపాదన మగుటవలన దీనికి పరమేశ్వరుని యాయుధ మగు 'త్రిశూలము' నే నామకరణముగా చేసియున్నారు కవిసమ్రాట్టులు, గ్రంథాంతమున ఈ మువ్వురూ మరణింతురు. శివుడు లయ మొనరించువాడు కావున వీరు మువ్వురు పరమేశ్వరుని సన్నిధిని చేరుట పరమార్థము కానోపును.

వీరశైవదీక్షను స్వీకరించిన మానవమాత్రు డెవడైనను జాతి కుల విచక్షణ లేకుండ అతడు పరమపూజ్యుడని వారి సిద్ధాంతము. అందుకు దృష్టాంతముగా మాచయ్యను చాకలిని వీరు చిత్రించిరి వీరి నేమైన అనినచో బసవేశ్వరునకు మహాకోపము వచ్చును 'అతనికి కోపము వచ్చిన లోకమునకు పరమ ప్రమాదము అందులకు రాజు గడగడలాడక తప్పదు. తక్కిన మతస్థు లందరూ వీరి ధాటి కోర్వలేరు. కాని బసవయ్య దృష్టిలో శైవులైనవా రందరూ సమానులు. జాతి కుల వివక్ష లేకుండా పంక్తిభోజనములు చేసెడివారు. సామాన్యు లాతని భోజనమునకు పిలుచుటకు భయమొందెడివారు, దానికి కారణ మాతని పిలువగనే అతనితోపాటు మాచయ్యను తీసుకొనివచ్చునని. ఈ నాటకమునం దంటరానితనమును నిషేధించుటను ఈవిధముగా వ్యక్తము చేసియుండవచ్చును శ్రీ విశ్వనాథ.

శ్రీబసవయ్య సాక్షాత్తు నంది యవతారమని ప్రజల నమ్మకము. ఈతడు కొన్ని మహిమలను చేసి చూపినాడు అందు గొల్ల అవ్వ నిదర్శనము. పాలు పెరుగమ్ముకొను గొల్ల బురదలో ఇరికికొని బసవని స్మరించినది వెంటనే బసవని హస్తము ఆమెను పైకి తీసినది అప్పుడు బసవడు రాజసమ్ముఖమున నున్నాడు కాని పైకి తీయు ప్రయత్నమును చేసినాడు. రాజేమని యడుగ జరిగిన వృత్తాంతమును చెప్పినాడు. రాజునకు నమ్మకము కలుగలేదు, భటులద్వారా అవ్వను పిలి

పించినాడు. అక్క వచ్చి జరిగిన విషయమును చెప్పినది. రాజు బసవని హస్తమును మాత్రమే చూపించినాడు. ఆమె ఈ హస్తమే అన్నది.

ఇట్లే రాజు అల్లయ్య, మధువయ్యల కండ్లు ఊడబెరికించినపుడు తన శక్తిచే మరల కండ్లను తెప్పించినాడు. ఊరిలోని శివభక్తు లందరిచేత కాలకూటమును అమృతమువలె త్రాగించినాడు. ఆ వాసనలు వ్యాపించినంత మేరకు శైవులు కానివారందరూ మరణించినారు. అయినవారు మాత్రము కనుగొందలేదు. పోకడివారి కూపి రాడకుండ త్రావినారు.

బిజ్జలుని సోదరి నీలయను నామె మహాశివభక్తురాలు. ఈమె శివునిపై పాటలను రచించినది. క్రమముగా నామె నిరంతరము శివధ్యానము చేయుచు కాలము గడుపుచున్నది. బసవని మహిమలు కళ్ళారా చూచిన బిజ్జలుడుకూడ వీరశైవుడైనాడు. కాని యాతనికి పరమతద్వేషము లేదు. బసవడుమాత్రము అన్యమత సహిష్ణువు కాడు అతనికి రాజనీతి చతురత లేదు రాజాశించినది వేరు. జరిగినది వేరైనది కాని బిజ్జలుడు చేసిన శివద్రోహమునకు తుదకు కళ్యాణకటక మంతరించినది. రాజద్రోహమునకు వీరశైవమే అంతరించినది.

ఈ గ్రంథము నందొక విశేషము కలదు. ప్రాచీన నాటకములందగ్రగణ్యమైన శాకుంతలము నందలి శృంగార రసమతివేలమైనది. దానిని భవభూతి బహురస సమన్వయముచే ఉత్తరరామచరిత్రమున గెల్చినాడు. మరల నీ నవీన నాటకముల యందీ త్రిశూలము అట్టి కోవకు చెందినది. ఇదియును బహురస సమన్వయము. వీరి నాటక రచనము వలెనే ఇందలి పాత్రలన్నియు భిన్నభిన్న దృక్పథములు కలవి.

ఒకడు కేవలము (బిజ్జలుడు) వీరరసావతారము. ఒకడు కేవలముభక్తుడు అతని భక్తి శాంతమైనది కావున ఆవేశములో రాజద్రోహమునకు దారితీసినది. ఇక అగ్రదేవుడు కేవల కర్మసిద్ధాంతి నీలమతమునకు ప్రతీక. శ్రీ పోణంకి అప్పారావుగారు తమ నాటకవికాసమున ఈవిషయమునే వెలిబుచ్చిరి

ఈ గ్రంథము బసవపురాణ మాధారముగా రచింపబడిన నాటకము ఇందలి పరిభాషయంతయు దాదాపు అప్పటి వాడుకభాషలోనే సాగినది. శ్రీ విశ్వనాథ అందలి ద్విపదలను కొన్నింటిని యవసరమైనచోట వాడుకొనియున్నాడు కొన్ని చోట్ల తత్తుల్య భాషనే రచించినారు ఇట్టి రచనా ప్రణాళిక ఆంగ్ల సాహిత్యమునందు తప్ప ఆంధ్ర సారస్వతమున నంతగా కనుపించుట లేదు.

వేనరాజు :-

ఇదియును పది అంకములు గల మహానాటకము. ఇది కేవలము 'బౌద్ధమతము'ను ప్రచారము చేయు గ్రంథము వలె గోచరించుచున్నది ఇందు ధర్మవీరము ప్రధానరసము నానికి కరుణమంగము ఈ గ్రంథమునందు కొన్ని విచిత్ర విశేషములు గలవు. రాజు పృథువు వేనుడు నాయకుడు కాడు. పృథువును నాటకమున చాలభాగము వరకు స్త్రీగా చిత్రించి తుదకు పురుషునిగా మార్చి రాజ్యమున పట్టాభిషిక్తుని జేసినారు శ్రీవిశ్వనాథ.

ఈపృథువు కేవల (దైవ) ధర్మస్వరూపుడు గౌతముడు ఆర్ష ధర్మ సముద్దీపనము చేయు వలె నని ప్రాకులాడెడి వాడు. కేవలము ఇవియన్నియు కల్ల లనియు భగవంతుడనే వాడు లేడనియు వేదము లన్నియు ప్రమాణములుకావనియు వేనుని సిద్ధాంతముకాని యలౌకికముగు దైవశక్తి విజృంభించినపుడు మానవశక్తి తలవంచక తప్పదను పరమసత్యమును శ్రీ విశ్వనాథవారు ఈ యిరువురి పాత్రలద్వారా వ్యక్తము చేసియున్నారు.

ఈ వేన రాజు నాయక లక్షణము లన్నియు సమగ్రముగా కలవాడు; కాని లోకమున కెదురీత వలె నాతని నాస్తికతయే యాతని మరణమునకు మూలమైనది. అతని యాజ్ఞలకు బెదరిన కొందరు వైన్యులైరి అదియొంత కాలమో నిలువ లేదు. ఈ గ్రంథారంభమున వీరు సూత్రధారునిచే 'నూతనప్రయోగ' నాటక' మని పలికించి వేనునిచే విషాదాంత మని చెప్పించినారు కాని వీరి రచనములన్నియు విషాదాంతములే. ఇది నవ్యతకు పరమ దృష్టాంతముగా పెద్దలు చెప్పుచున్నారు. కాని మనము జాగరూకతతో పరిశీలించిన రామాయణ, భారత భాగవతములు కూడ విషాదాంతములే కాని మన ప్రాచీన నాటక కర్త లందరూ మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతాని చ' అని మోదాంతములనే ప్రశంసించుచున్నారు.

ఇందు వేనుని యాజ్ఞచే చనిపోయిన వారందరూ పిశాచములై వేనుని కలవరించుట చాలచిత్రము పైగా వారిందరిలో కొందరీతనికి కైవారము చేయుదురు ఆ కైవారములో మహార్థములిమిడి యున్న సంగతి పాఠకులు గమనించగలరు. తుదకు విప్రశాపము వలన పడి భుజమును గోల్పోయిన వేనుడు అలౌకిక శక్తి నొప్పుకొనక తప్పినది కాదు. ఇది ప్రాచీన సిద్ధాంతానుసారముగా వేదమత స్థాపనమునకై వెలసిన మహాగ్రంథము.

మానవధర్మ స్వరూపుడగు అంగరాజు వేనుని దృష్టిలో మాత్రమే పిచ్చివాడు అంగరాజు చాల తెలివికలవాడు అందులకు నిదర్శనము పృథువును స్త్రీగా పెంచుటయే అతడు పురుషుడని మానవ మాత్రులకు తెలియరాదు వీరలకా తెలిసికొను శక్తిలేదు. కావుననే భూదేవి గోరూప ధారిణియై అతనికి కనుపించి

ఆవిషయమును జ్ఞప్తి చేసినది. అప్పటి నుండి పృథువులో మార్పు వచ్చినట్లు విశ్వనాథ చిత్రణము మరింత అద్భుతావహము.

'నావిష్ణుః పృథివీ పతిః' పృథువు సాక్షాత్తు శ్రీమన్నారాయణుని యంశాంశము అందుచేతనే భూదేవి వసుంధరయై అతని వివాహము చేసుకొనినది గ్రంథాంతమున వేనుడు పృథువును గాంచి పలికిన 'నీవు లే వని వాదించిన నావితర్కము అన్నియు నాకు రాత్రి తెలిసి'నవి అని పలికి అర్థమును ప్రవచించునపుడును పృథువు' ఎంపెడివాడెవడు? చచ్చెడివాడెవడు? అనుట గమనింప దగినది

వేనుడు సాక్షాన్మృత్యువు అతని గణములు విజృంభించి ప్రజలను చాల సంక్షోభమునకు గురి చేసినవి. ఈతని వర్ణనము కూడ చాల భయంకరముగా జేసినారు శ్రీవిశ్వనాథ. ఇది యెవరు చేసిరో తెలియదు. తెరనుండి

'సాక్షాన్మృత్యువు వాని కన్నొమ మహా
క్షామాగ్ని ధూమంబులో
కక్షోభ్యా ప్రకృతి వాని లేనగవు నా
కారమ్ము రుద్రాఖ్యధి వా
డీక్షోణీస్థలి ధూమకేతువు మహా
తృష్ణాపరీ వాహమౌ
లాక్షుఖ్యుత్పటు వక్రమార్తి మృతి యే
లా కల్గు నవ్వానికిన్'

ఇందులకే కాబోలీకని మరణమును పాత్రలకే వదలి వేసినారు విశ్వనాథ

మృత్యువు కూడ నారాయణునియాజ్ఞ ననుసరింపవలసినదే పృథువు చేసిన ప్రతిజ్ఞ గెలిచినది. పంచ ప్రాణములు గూడుకట్టుకొని నిలచిన భూదేవి యాత్మగతముగా ననుకొన్న ఈమాట 'అనిలవతీ, స్థలవతీ, జలవతీ తేజో వతులు నాకు సర్వధా నేను కోరినట్లు ఉపకరించిరను నది పృథివ్యప్ తేజో వాయ్వాకాశపంచ భూతాత్మక మీశరీర మను సిద్ధాంతమును విశదము చేయుచున్నది.

వేనరాజును నాయకునిగా పరిగణించినపుడిది ఉత్తమ విషాదాంత నాటకముగా పరిణమించును ఇది ఆంగ్ల నాటకానుసరణము పృథువును నాయకునిగా చూచిన మంగళాంతమై ప్రాచీన నాటకము వలెను వేనుని నాయకునిగా చూచిన పాశ్చాత్యనాటకానుసరణము వలెను. భాసించును ఇట్లు రచించుట వీరికే సాధ్యము. వీరి గ్రంథములను జాగరూకతతో పరిశీలించిన మరియొక విషయము తెలియుచున్నది. వీరి చేతిలో కథా సంవిధానముతో పాటు పాత్రపోషణ మత్యంత రమణీయముగా సాగినది వీరి పాత్రలలో గేయ కవిత్వము (భావ కవిత్వము) ప్రతినాటకమునందును ఏదియో ఒక పాత్రయందు కనుపించును. నర్తనశాలయందు ఉత్తర పాత్రలో గేయ కవిత్వమును, నాట్యమును, త్రిశూలము నందు నీలయందు, వేనరాజులో అంగరాజునందును వీరు పరిపోషించుట గమనార్హము.

అనార్కలి -

ఇదియొక క్రొత్త నాటకము. ఈ నాటకమునందు అంకములు లేవు కాని స్థూలముగా పూర్వాంకము, ఉత్తరాంకము నని విభజనము చేసి రంగములను నెలకొల్పి నాటకమును రంగరించినారు కవి సమ్రాట్టులు. ఇది నవ్యతకు ప్రతీక.

ఈనాటకమునందు అంగి రసము కరుణము. విప్రలంభ శృంగార మంగరసముగా పోషింపబడినది. కరుణరస ప్రధానములగు ప్రాచ్యనాటకములలో భవభూతి యుత్తర రామ చరిత్రము మనకు మున్ముందుగా దర్శన మిచ్చు చున్నది నవ్యనాటకములలో నిది యంతటి దని చెప్పవచ్చును.

ఈఅనార్కలియందు కొన్ని వినూత్న విశేషములు గలవు ఈ అనార్కలి కావ్యనాయిక. ఈ గ్రంథము మాహమ్మదీయము, సలీము నాయకుడు. వీరియువురు వివాహము చేసుకొన్నట్లు చాలాకాలము వరకు ప్రజలకు తెలియదు కాని తుద కిరువురు మరణింతురు నాయకుని మరణమును మాత్రము పాఠకులకు వదలినారు శ్రీవిశ్వనాథ ఇదిపాశ్చాత్య నాటకలక్షణానుసారము విషాదాంత నాటకము పాశ్చాత్యులు మోదాంతములకన్నను విషాదాంతములకే ప్రాముఖ్యము నిచ్చినారు. ఒక దృష్టితో చూచిన కీచకుడు నాయకుడుగా నర్తనశాలయు విషాదాంతమే. ఈ వీరి నాటక చతుష్టయము విషాదాంతమే.

అభిజ్ఞాన శాకుంతలమున కాళిదాసు శకుంతల గుణములను పాత్రములుగా మలచి యబ్బుర పాటును గలిగించినాడు. ఈ అనార్కలి యందు మధుమాసమును, అందలి విశేషములను పాత్రములుగా మలచి క్రొత్తద్రోవ త్రొక్కినారు విశ్వనాథ. ఇందు వసంతుడు, పుష్పకన్యకలు, మున్నగు పాత్రలు సహజత్వమును వీడలేదు

ఇందు బానిస కులమును గూర్చి చక్కగా వివరింపబడినది. అనార్కలి బానిస కులమునందు పుట్టిన దగుటచే సలీమును వివాహము చేసుకొన వలదని తండ్రి నిర్బంధించినాడు గ్రామాంతరమున నాట్యము నేర్పాటు చేసి రాజును వలలో వేసుకొను చున్న దను నేరారోపణము చేసి ఆమెను ఉరితీయించినాడు. నాయిక మరణముచే నాయకుడు కూడ తత్తుల్యావస్థను పొందినాడు

నాయిక మరణమునకు పూర్వముకూడ నాయికా నాయకుల మధ్య వియోగ శృంగారమే పరిపోషింప బడినది. సంయోగ శృంగార మెచ్చటను లేదు. 'ఏకో రసః కరుణ ఏవ' అన్నట్లు ఈవియోగ శృంగారము తుదకు కరుణముగ సందర్భించినది. ఇట్టి రచనా విధానము అనితర సాధ్యము.

ఇక నాటకమునందు ప్రకృతి వర్ణనము మిగుల హృద్యము. కావ్యారంభమున వీరు సలీముచే 'అనార్కలీ' పుష్పవాసనా రహితమని చెప్పించుట కావ్యమునందలి నాయికకు ముడిపడి యున్నది. వాసన లేని పూవు ఏవిధముగా అందమున్నప్పటికినీ రాణింపదో ఆవిధముగా సౌందర్యరాశి, సద్గుణశీలయు నగు అనార్కలి బానిస కులమున జన్మించిన కారణమున సలీముతో వివాహమున కనర్హురాలైనది.

ఈగ్రంథమునకు నామధేయము సదృశమై చక్కగా సరిపోవుచున్నది. పూవును స్త్రీతో పోల్చుట కవిసమయ సిద్ధము. ఎరిరువురకును ప్రోత్సాహకముగానున్న రనీ అజీజ్ లు కూడ మరణించుట మరీ విషాదకరము.

వీరు కేవలము సంస్కృత నాటకము లకు అను వాదమును మాత్రమే చేసి యుండ లేదు. స్వతంత్ర రచనము కూడ చేసి యున్నారు. అట్టి స్వతంత్ర రచనకు దృష్టాంతములే త్రిశూలము, అనార్కలి, వీనరాజును. ఈ అనార్కలీ చారిత్రాత్మకము. భిన్న భిన్న దృక్పథములుగల ఈ నాటకములను చదివిన శైలినిబట్టి సత్యనారాయణ[శాస్త్రి]గారి వని కనుగొనవచ్చును. ఇట్టిరచనా వైవిధ్యము కవులకును లేదనవచ్చును.

ఈ నాటకచతుష్టయము సాహిత్య గౌరవముగల నాటకములందు విశిష్ట స్థానమును పొంది యున్నది. ఈ నాటకము లందు - రచనా సంవిధానము నందును, ఇతివృత్త స్వీకరణమునందును, రస పరిపోషణము నందును, ఔచిత్య సంరక్షణము నందు విశ్వనాథ కవితా వైశిష్ట్యము గోచరమగుచునే యుండును ఇట్టి రచనా ప్రణాళిక కవిసమ్రాట్టులకు గాక మరెవ్వరికి సాధ్యమగును?

---

## డా. వాసా ప్రభావతిగారి - 'అమ్మ బొమ్మ'

-శ్రీ డా. ఆచార్య భావన్. ఎం ఏ, పి హెచ్. డి

---

'పుణ్యముల తల్లి నీపాల పుష్టికతన
కవన బాలిక నాజిహ్వ నవతరించె'.

అని నవయుగ కవిచక్రవర్తి జాషువాగారు తన కవితాశక్తికి కారణమైన తల్లిని కొనియాడుతూ పద్యాలు రాసారు ఈ కారణం జాషువా గారు రానివప్పటికీ, ప్రతికవికీ - ప్రతికవయిత్రికీ అన్వయిస్తుంది. అసలు తల్లిచలవ లేకపోతే మనం కవిత్వం రాయడం కాదుకదా, అడుగుతీసి అడుగువెయ్యలేం. అన్ని విధాలా మన అభ్యుదయానికి అమ్మే ఆటపట్టు, అమెలేకపోతే మన ఆట కట్టు. అలాంటి అమ్మపై కమ్మనికవితలు చెప్పి, ప్రత్యేకంగా ఒక కావ్యాన్నే తయారు చేసి, తమ 'అమ్మ'కే అంకితం చేసిన డా॥ వాసాప్రభావతి గారు కవితాలోకంలో ప్రత్యేకంగా పేర్కొనదగిన కవయిత్రి ఈ కావ్యంలో వారు చిత్రించిన అమ్మబొమ్మ ఎంతో విలక్షణమైనది. హృదయస్పందన కాస్పదమైనది మన కన్నులలో కలకాలం కొలువుచేసేది మనకు అభయభిక్షను ప్రసాదించేది.

అమ్మపై ప్రేమ, భక్తి, గౌరవం వుండని జీవి ఈసృష్టిలోనే వుండదు. అమ్మను యథాశక్తి ఆరాధించటం ప్రతి జీవికి లభించిన విశిష్టవరం. ఈ వరాన్ని సద్వినియోగ పరచుకోవటం వివేక లక్షణం. అలా సద్వినియోగ పరచుకున్న వివేకశాలిని - శ్రీమతి ప్రభావతి గారు నవకవితా ప్రతిభాశీల.

అన్నిజాతులవారికీ, అన్ని మతాల వారికి - ఇంకేమైనా వుండకపోవచ్చుగాని, 'అమ్మ' మాత్రం వుండి తీరుతుంది. అసలు ప్రకృతిలో అమ్మలేని జీవి లేదు. అమ్మ పెట్టిన భిక్షే ఈసృష్టి సమస్తం. ఈలోకంలో ప్రతిఫలాపేక్ష లేకుండా తన విశిష్ట సేవలను అందించే మూర్తి - ఒక్క మాతృదేవత మాత్రమే. ఇంతటి మహోన్నత మాతృమూర్తిని తమ సుందర, సుకుమార, భావకవితా ప్రసూనాలతో అర్చించి, కొంతకొంత ఋణవిముక్తురాలు కాదలచిన శ్రీమతి ప్రభావతి గారు అభినందింపదగిన వారు. తీసుకున్న వస్తువును తీర్చి దిద్దటంలో ప్రభావతి గారి ప్రతిభా ప్రాభవాలు ప్రతికవితలోను మనకు దర్శన మిస్తాయి. ఇందులోని ఖండికలన్నీ కలకండపలుకులై 'అమ్మ'తియ్యని ప్రేమని, కమ్మనివాత్సల్యాన్ని మనకు చవి చూపిస్తాయి. మాతృమూర్తి హృదయ సంస్కారాన్ని, సౌకుమార్యాన్ని పుణికి పుచ్చుకున్న శ్రీమతి ప్రభావతిగారు తమ కవితాకన్యలో గూడా సంస్కారాన్ని సౌకుమార్యాన్ని నింపి కృతకృత్యు లయ్యారు. సుతిమెత్తని పదాల వాడుకలో, చిన్న చిన్న మాటల అల్లికలో కవయిత్రి చూపించిన నేర్పు ప్రశంసార్హమైనది. ఇందులోని ఒక్కొక్క ఖండిక 'అమ్మ' వైశిష్ట్యాన్ని భిన్నభిన్న రూపాల్లో దర్శింపచేస్తుంది.

అచ్చతెనుగు అందచందాలలో ఆటలాడే అమ్మ, బంగారం కన్నా ఖరీదైన అమ్మ, దైవాన్ని మించిన దైవమైనఅమ్మ, అందరికీ రక్షయైన, అమ్మ, మానవప్రగతికి జీవమైన అమ్మ, మొట్టమొదటి గురువైన అమ్మ,తండ్రిని పరిచయంచేసేఅమ్మ,

త్రాసుకే తూకం నేర్పే అమ్మ, న్యాయమూర్తికి పాఠాలు నేర్పే అమ్మ క్రొవ్వొత్తిలా కరగిపోయే త్యాగమూర్తి అమ్మ- ఇంకా ఇంకా, ఎన్నో విశిష్టగుణాలున్న అమ్మవిశ్వరూపం ఈ కావ్యంలో మనకు నేత్రపర్వం చేస్తుంది

'పదాని కన్న శక్తి
భావాని కన్న బరువు
సృష్టిలో మరి దేని కన్నది
భౌతిక అంత రంగిక
శబ్దాలు అన్నీ
భావాలు అన్నీ
అమ్మలోనే,
ఇమిడి పోతాయి.

అని 'అమ్మ' విశిష్టతని కవితోక్తంలో చిత్రించగల కవయిత్రి భావనాశక్తి - ఆదర్శమై నిలచి పోగలదు, ఆరనిజ్యోతియై వెలిగి పోగలదు.

శ్రీమతి ప్రభావతిగారు చిత్రించిన ఈ 'అమ్మ' బొమ్మను దర్శించిన ప్రతి తల్లికీ ఆనందం, ప్రతిబిడ్డకీ అనురాగం కలుగుతా యని నిస్సందేహంగా చెప్ప వచ్చు. ఈ కవితా చిత్రం వినిపించే సందేశం సర్వజన శిరోధార్యం!!

తమ గురువుగారైన డా॥ సి. నారాయణరెడ్డిగారు ప్రభుత్వ ఆస్థానకవులైన డా॥ దాశరథి గారు ఈ కమ్మని కవితలపై తియ్యని ప్రశంసలను, చల్లని ఆశీస్సులను అందిచటం శ్రీమతి ప్రభావతిగారిప్రజ్ఞకు నిదర్శనం. రసజ్ఞులైన సహృదయ విమర్శకుల ప్రోత్సాహం లభించిన శ్రీమతి ప్రభావతి గారు కవితాభ్యుదయాన్ని సాధిస్తూ - సందేశ, ప్రయోజనాత్మకాలైన రచనలను చేస్తారని ఆశించటం, చేయాలని ఆదేశించటం ఎంతైనా సమంజసం!!

# కావ్యాలంకార సంగ్రహము - సమాజ దర్పణము

- శ్రీ పి. కనుమ, ఎం. ఏ.

( గతసంచిక తరువాయి )

దిష్టితీసే ఆచారం నాటికే అమలులో ఉన్నది 'మరు చిత్రలిఖితుం గని బి; త్తరి వెలవ పరాగభూతిం దగ నిడి చిగురా; కర ము దిగదుడిచి యులుపు, విరిబోనము వేయ దొలగె వెలపు నృసింహా! చిత్తరువున సన్న మన్మథుని చూచి నాయిక భయపడగా చెలులు పుప్పొడి అనే బూదిని పూసి, చివు రాకుల దిగదుడిచి తుమ్మెదలకు పూల అన్నాన్ని బలి పెట్టారు. కలుగానుగలు, చల శాణ మత్స్యాదియంత్రాలు, గొడుగులు, వీవనలు త్రాసు, సిరాలు మొ॥వాటిని అప్పటికే తయారుచేశారు. రాజ ప్రతాప మహాతప మబ్జ జాండకర్పరములు నిండి తీవ్రగతి బ్వ నఖర్వ సగర్వ వైరిభూ, వరులు వడంకసాగుగు; రవార్య నవవ్య జనాతపత్రవై ఖరులు దొలంగ జేయుదురు' 'శరవేగములు లేవ చలయంత్ర పారీన పాటన క్రియకు నేర్పడవు గాక.'

సరసు! నృసింహా! నీ యశము
చంద్రుని త్రాసువధాత తూచినన్
సరభసవృత్తి నెత్తుడిగి
సామ్యనిరూఢి వహింపలేమినో
యరయ గురుత్వహేతుమలి
నాంక నిరంతశలో హాటంక సం
కరమును చెందె చంద్రుడు, జ
గంబు,వృగం,ఒని చూచుచుండగన్'

ద్రవ్య వినిమయము వచ్చి లోహాటంకములు త్రాసులు ఉపకరించినవి.

'అరయ పయోధి పాత్రమును
నంజనశైలము కజ్జలంబు త
త్పుర తరు శాఖ లేఖిని వ
సుంధర పత్రముజేసి వేడ్కతో
కరలి విరించి గేహిని లి
ఖించిన పారము వొందవౌర! మా
నరసనృపాల మౌళి సుజ
నస్తుత సద్గుణ సంప్రదాయముల్'

16 వశతాబ్దంలో హిందూదేశం అనేక దండయాత్రలను ఎదుర్కొన్నది. యవన, పారసీక, తురుష్క-దండులు హిందూదేశంపై దండయాత్ర చేసినవి. చంద్రగుప్త, తోరగంటి దుర్గాదులు కోబయవంశజులచే పాలింపబడినవి 'లాటీకుచాభోగ పాటీర పంకంబు, బోటీముఖాబ్జ - కర్పూర కలన ..' నాడు లాటీ, గౌళీ, చోళీ, కళింగీ, భోజీ, కాంభోజీ, కుంతలీదేశా' దులు పాంచాల హిందూదేశ భూభాగములు నరసరాజు తోరగంటి దుర్గ ప్రభువు తోరగంటి రాజ్య, స్థిరసింహాసన నివాస దీక్షానిధికిన్ వరయంత్ర మత్స్యభేదన; బిరుదోద్దండునకు గండభేరుండునకున్' ఓబయ నరసరాజేంద్రుడు పారసీక, యవనాదులను జయించినాడు

'పారసీకతమః పతులచొప్పడగించి
నేర్పు మీఱగ మోహ నిద్ర పుచ్చి
యవన సేనాధి నాయకులదోః స్తంభసంభరిత ప్రతాపదీపంబు లడచి
యభిభూతలాసమల్లావిష్కృతాయజో
ధ్వాంత సంతతి కాత్మ సంతసిల్లి
సమదముష్కర తురుష్క ప్రాప్తసీమల
నడుగు మోపగనీక యరుగుదెంచి
ప్రాజ్య సామ్రాజ్య యగు వారిరాజలక్ష్మి
కదనసంకేతమున జారకాంత యగుచు
నంచితస్ఫూర్తి నిన్ను వరించె నౌర!
వైరిగజ సింహ! యోబయ నారసింహ!'

...అనుచు 'యవనుల' దెగడి తన్నా
శ్రయించు
వారిసామ్రాజ్యలక్ష్మి వెవ్వాకు గొనియె
నాహవోగ్ర బరీద 'సప్తాంగహరణు
డతడు విలసిల్లు శ్రీ వేంకటాద్రివిభుడు'
(ప్ర - 85 ప)

'అదె యిదె వచ్చె నర
సాధిపు దాడి యటంచు పాళెము
ల్బెదరి బరీదు దేగు వెడ
బెంపతి 'ఖానుమ' వెన్క ముందుగా!
గదిసిరి'

'అని మొన శ్రీ నృసింహావసు
ధాధిపు తీవ్రచసమూహము
గనుగొని యత్యద్భుతం బొదవ
ఖావవజీరులు బ్రేళ్ళ నోళ్ళకుం;
జొనుపగాక

'గర్వితబరీద సేనా! సర్వస్వహరాణివా
ర్యశౌర్యవతః; విజయభేరికా - భాంకృతి
కిన్' (ప్ర 105ప) 'పీనన తుల్కా
స్థాపన; మానితకరుణా ప్రసంగ మాంగ
ళ్యనకిన్'

దండయాత్రలు చేసే పాళెములు, సేనావాహినులు గుడారాలు వేసుకుని, మకాం వేసేవి.

'...జరిపాటితకనకకూటపటవాటములై'

విదేశీయుల రాకతో సాంఘిక పరిస్థితులలో ఆచార్య వ్యవహార భాషా సాహిత్యాదులలో కొంత మార్పు రావటం సహజం నరసరాజునకు భయపడి శత్రువులు కలసులుపోయిరి అందుచేత తద్గృహ నగరాదులు పాడుపడి చెట్లు మొలచినవి. 'మిత్త్రిగేహముల నమిత్ర గేహమ్ముల కనక సంఘాత మే ఘనుడు నిల్పె...'

విదేశీయుల రాకతో సముద్రాలకు ఆవలనున్న దేశాలతో, వ్యక్తులతో పరిచయ వ్యాపార వ్యవహారాలు పెరుగుతాయి. తురుష్కాదుల ఆగమనంతో 'చతురంత యానాదులతో 'సీటిఓడలు' కూడ ప్రయాణోపకరణాలలో చోటు చేసుకున్నాయి

'గంభీర రసరము జ్యృంభిత కవితాంభోధి తరణ కరణ ప్రగుణోపకరణ పరిణత తరణి ప్రకాండంబు, విశేషగుణదోషవిశేష దుర్వార నీర క్షీర వివేచనోచిత' ప్రశంసి హంసాయమాన ప్రతిభానుబంధంబు నగు నొక్క ప్రబంధంబు నిర్మింపబూని, కవిత అనే సముద్రాన్ని తరియించుటకు ప్రబంధము మేటి ఓడగా కవి భావించినాడు. 'శ్రీమించు పద్మినీ భామామణికి నుండు, నిరతసంసార - వార్నిధికి తరణి' ఈరీతిగా నదీ ప్రయాణోపకరణి పడవస్థానే సముద్రాన్ని తరించే పెద్దఓడ 'కావ్యాలంకార కారసంగ్రహం' లోనికి ప్రవేశించిది

విదేశీయుల ప్రభావంతో ఆంధ్రభాషలోనికి జనని సంస్కృతఅన్య భాషా పదాలుకూడా చోటు చేసుకున్నాయి.

'బచ్ నా' అంటే 'చెప్పుట' అని అర్థము' నీప్రవీణత! ల్యానుకడ వికనీసటలు బచ్చెన చేతలు చాలుచాలు '
'నీ సటలు' అంటే 'నీ నడకలు'

'గురువనీపకుల కాదర మొకప్ప కొండని యొసగియు కొండని యొసగకుండు.' (వనీపకులు = యాచకులు, ఆటవికులు). తప్పుగల భర్త్ర మోల సోత్ప్రాసఫణితి; 'కేరడము' (=కరిహాసము) లాడు సతి మధ్యధీర ' 'కనకకూట' కటవాటములై '(=గుడారములు).' బేసి తేజీల' నెనయు మిన్నుల తేరిజోదు పుట్టిన కొండ జూచినాడ!' నిటుల నేలజేజేల కఱంకైన చెంగావి సుదసంజదగు కొండ జూచినాడ! ' మిన్నేట నీ! రాడంబో యెడి బేసి తాపసులు మేలా! ..' 'బేసి' అంటే 'సరిసంఖ్య కానిది.' సప్తాశ్వ రథము కలవాడు సూర్యుడు! 'బేసి తాపసులు' సప్తర్షులు! 'నేలజేజే' బ్రాహ్మణుడు, అలాగే పాళెములు,' బదరీఖానుని తురుష్క సేనలు, త్రాను, వైమానికాది పదాలు నూత్న సంప్రదాయ సమ్మిశ్ర సూచకములు. మాష్కరులు వేల్పుకన్నియల సేవేళ కిషీయంపు, బిట్టుసేకల గాసి పెట్టువారు, సమురు జాజల్లు లగు నని బేసితా, పసులకూర్చము లూడ్వబరచువారు'

' అగు నొక్కటి కర్ణవైరి, హరి
చందనపుం,
'జిగురు' ను నీ చే జిగురుం!
బొగడొందుట కిదియె భేదము
నృసింహనృపా!'

ఈరీతిగా కావ్యాలంకార సంగ్రహము మనకు ఆనాటి సమాజాన్ని సామాజిక వైభవ సంపదలను, చిత్రలేఖన సంగీత శిల్పాది కళా సంపదను 'అంగ వంగ, మాళ, వావంతి, గౌళ, నేపాళ, చోళ, కురు, కురు పాండ్య, శకాది' (5 అ-181ప) దేశ నామాలను, యవన, తురుష్కుల దండయాత్రాది చారిత్రకాంశాలను, భాషార్ణవాలను మనకు పరిచయం చేస్తున్న అమూల్య గ్రంథరాజము.

# నారాయణదాసుగారి 'బాటసారి - వర్ణనా వైశిష్ట్యం

- శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ, ఎం. ఏ.

'చిఱుతాలపై జిలిబిలిగ బాఱు నేఁడయేటి
  నీటిపై అకవాకి దాఁటు జూచి
సాపాట నలవాటు బూని మెల్లఁగ జేరి
  వచ్చు జింకల కూర్మి పాటు జూచి
మడుఁగులఁ జెలరాడి బెదిదపుటొడ్డులఁ
  బొలియించు నేనుఁగు పోటు జూచి
దువ్వి మొద్దుగొనుచు దొడ్డపులులతోడ
  పాటాడు చెంచెత నీటు జూచి
వర్ణనము సేయుచున్ భూరి వనములందుఁ
బలురకంబుల పిట్టల పలుకులకును
స్వరముగట్టుచుఁ జెట్టుల కట్టలందు
పద్యములు వ్రాయు భాగ్యంబు పట్టు
  నెపుడు!'

అని ఉత్కంఠతో వర్ణనల స్వరూపాన్ని గూర్చి భావనచేసిన కవి ఎవరైనా ఉంటే వారు హరికథాపితామహులు, సంగీత సాహిత్యాల రాశి పోసిన పుంభావసరస్వతులు అయిన శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు తప్ప మరొకరు కారు!

అసలు, సాహిత్య లోకంలో 'కవయతే వర్ణయతీతి కవిః' అను సూక్తి సుప్రసిద్ధంగదా! అనగా వర్ణించేవాడు కవి అని అర్థం! ఇతడు వర్ణించడం దేనిని- ప్రకృతిని; ఆ ప్రకృతి యెట్టిది? మానవసంబంధమైనది, పరిసరవాతావరణ సంబంధమైనది, కథ చెప్పడం గూడ వర్ణనం అవుతుందిగదా, అయితే మళ్ళీ ఈ వర్ణన లేల అని సందేహం కల్గవచ్చు. కావ్యనాయకుని జీవితంలో జరిగిన సంఘటనల అనుభూతి స్మృతికి, తత్పరామర్శకు వానికి(ఆకావ్యనాయకునకు) అవకాశం ఇవ్వడంకోసం, ఒక్కొక్క వ్యూహ సందర్భాన్ని అనుసరించి కావ్యపాత్రల మానసిక కాఠిన్యాన్ని వ్యంగ్యంగా ఆవిష్కరించడం కోసం, మరియు పాఠకులకు పఠనవ్యగ్రతనుండి విశ్రాంతి నివ్వడం కోసం, వర్ణన వర్ణన కో సందర్భ కథకు అనుకూలంగా, కథాసూచకంగా ఔచిత్యవంతంగా ఉండాలి, కవి ప్రతిభావ్యుత్పత్తులకు వర్ణనలే నికషోపలాలు; ఒక కావ్య సంపాదకీయంలో ఆచార్య యస్. వి. జోగరావుగారన్నట్లుగా ఏ కవికైనా అతని సాహితీ సర్గానికి ప్రధానమైన ఉపాధులు 1) ఊహాశాలిత; 2) అనుశీలనం; 3) విషయజ్ఞత; 4) అనుభవం, ఈనాలుగూ వర్ణనాశ్రయాలు; ఈలక్షణాలు కలిగిన వాడు మహాకవి; లేనివాడు సామాన్యకవి; ఇట్టి వర్ణనల విషయంలో నారాయణ దాసుగారి కావ్యాల్లో 'బాటసారి' మేలురమైనది; ఇది శ్రీ దాసుగారిచేత ఆంగ్లభాషలోనికిఁ గూడ అనువదింపఁబడుట చెప్పుకోదగిన విశేషం! ఈవిషయాన్ని పరిశీలించడానికి ముందు ఈ కావ్యతత్త్వాన్ని తెలిసికోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది!

ఇది యొక్క గూఢవస్తుమయ కావ్యం! ఇందలి కథ కావ్యారంభంలో మొదటి పద్యంలోనే ఇలా క్లుప్తంగా చెప్పబడింది -

ఒక్క మహాత్మ భావుఁడు మ
  హోదధి యానముచేసి ముక్తినన్
దక్కితొలంగిపోవునిజ
  దారసుతార్థము నై సరోనది
పక్కణ సీమలన్ వెదకి
  వారలు సుస్థితి నుంట గాంచి పెం
పెక్కను బాటసారియను
  యిక్కథ పేర యశోవిహారియై॥2॥

సముద్ర యానంలో దారా సుతులను కోల్పోయిన బాటసారి వారికై వెదకుచు ఒకపాదుషావలన వారిజాడ నెఱుంగుట, ఆపాదుషాకోరికపై వాని అన్నకొడుకునకు, వాని మేనమామ కుమార్తెను పొందికను సమకూర్చుటకును, తాను లాభఁ పొందుటకును, ఆ అన్న కొడుకుతో తన ఆలుబిడ్డలున్న నెలవునకు వెడలుట, కడకు అన్నివిధముల శుభఫలితము నొందుట- అనునవి యిందలి ప్రధానకథా సన్నివేశములు.

బాటసారి - ఆత్మ పదార్థం. అతని దారాసుతులు - విద్యావివేకములు, బాటసారిని రక్షించిన రాజదంపతులు - జ్ఞాన వైరాగ్యములు, బాటసారిచే ప్రయోజనాన్ని పొందిన నూతన దంపతులు - భక్తి శ్రద్ధలు - ఇత్యాదిగా ఈకథకు వేదాంతార్థాన్ని శ్రీ నారాయణదాసు గారు ఊహించారు. ఇందలి పాత్రలకు ప్రత్యేకంగా ఏ పేర్లూ పెట్టకపోవడం అనేది కావ్యగత వేదాంత తత్త్వాన్నే వ్యక్తీకరిస్తోంది; ఇంతకూ సంపాదకీయంలో శ్రీ S V. జోగారావుగారన్నట్లుగా అవిద్యావరణంలో అవతరించిన మానవజీవితం ప్రజ్ఞానసిద్ధిని బడసి సార్థకమగుట యిందలి వస్తుతత్త్వం!

ఇట్టి విశిష్టకథాకథనధోరణి గల్గిన ఈ కావ్యంలో అనేక వర్ణన లున్నాయి ఇంకా భవిష్యత్కథను సూచన చేసే వర్ణనలు గల వనడానికి పాదుషాపాత్ర ప్రవేశాన్ని తెలిపే ఈక్రింది పద్యం నిదర్శనం -

చుట్టు చెలువలు కొలువగ సొంపుతోడ
కలుగు తనముద్దు కోమలి చెట్ట బట్టి
చుక్కయందున రోయిని పక్క నొప్పు
చందురునివలె నొకపాదుసాహి తోచె॥5

ఇచట జ్ఞానానికి ప్రతీకయైన పాదుషాను కవి, చంద్రునితో పోల్చడం జరిగింది; చంద్రుడు జ్యోతిశ్శాస్త్రప్రకారంగా మనఃకారకుడు; ఇతని ప్రతీక గుణమైన జ్ఞానం కూడ మనస్సంబంధియే. చంద్రుడు కాంతిస్వరూపుడు కనుక తత్తుల్యుడైన పాదుషాగూడ బాటసారి చీకటిబ్రతుకునకు ముమ్ముందు వెలుగును చూపించగలడనే విషయం సూచింపబడింది! ఇట్టిదృష్టితో ఉపమాలంకారం సమకూర్చబడడం ఇచటి విశేషం!

ఇక కథాపాత్రల గుణగణాలతో కలసిపోయిన వర్ణనకు బాటసారి తన సతీసుతులను స్మరించుకొన్న యీ పద్యం తార్కాణం :-

వెల్లవారిన జాబిల్లి వేగుచుక్క
యును దివంబున వెలయుచునున్నయట్లు
చిన్ని కొమరునితో ముద్దుచెలియ తేలు
చుండెడి గాబోలు! మున్నీట నిండు
దోఁగ॥ 6

ఇచట చిన్నికొమరునితో కూడిన తన ముద్దు చెలియను వెల్లవారిన జాబిల్లి, వేగుచుక్కలతో పోల్చడం జరిగింది! ప్రకృత కథలో దారాసుతులు విద్యా వివేకములు! ఆగుణాలకు జాబిల్లి వేగుచుక్కలు పోలికలుగా చెప్పబడ్డాయి, కాని ఇచటి జాబిల్లి వేగుచుక్కలు వెల్లవారినవనీ, మున్నీట నిండు దోఁగినవనీ చెప్పడం వారు ఆపదలో ఉన్నట్లుగా సూచనచేయడం కోసమే!

ఇక క్రొత్తరకములైన ఊహాలకు, ఆ ఊహల్లోని సహజత్వానికీ, వర్ణనలో సంగీతశాస్త్రసమ్మేళనానికి రాచకొమరుడు నెచ్చెలియైన బాటసారి విన్నదనాన్ని పోగొట్టడానికి ప్రయత్నిస్తూ అప్పటి వార్షిక వాతావరణాన్ని వర్ణిస్తూ పల్కిన యీ క్రిందిపద్యం ఉదాహరణ:-

తొలి తెల్లకొండలవలె నున్న మొగిళులు
గొప్పలై నీలిరంగులు దనర్చె
దూది పింజలలాగు దొడ్డమబ్బుల నీకి
కరువలి పరుపులుగా నొనర్చె
వెండిచబుకు ద్రిప్పివేసిన యట్టులు
మెఱుములతోడుత పెద్దయురుములు పుట్టె
నేల కమ్మని తావి నెగడించు చందంద
వలుదలై తెక్కు చినుకులు మొదలిడె
మింటికిన్ మంటికిన్ దఱుచు మీఱు వాన
ధారలను తీగెల బిగించి ఆరవవడి
వీణె వాయించు నెఱజాణ గాణమాడ్కి
అందముల గుప్పి గాలి పాడం దొడంగె॥7

దూదిని ఏకి పరుపును తయారు చేయడాన్ని మబ్బుల్లో దర్శించడం, వెండి చబుకు త్రిప్పి వేసినట్లుగా మెఱుముతో పెద్ద ఉరుము పుట్టెననడం అనేవి కవియొక్క నవనవోన్మేషశాలినియైన ప్రజ్ఞకు నిదర్శనాలు! ఇచట ప్రజ్ఞ ఊహాత్మకం! గాలినే నెఱజాణ గాణగా చేసి మంటిని మింటిని ఏకంచేసే వానధార అనే తీగలను బిగించి షడ్జస్వరంతో ఆ గాలిచే వీణ వాయింపజేయడం కవియొక్క వినూతనమైన యుపజ్ఞ; సంగీతశాస్త్ర విషయాల్ని వర్ణనావసరాల్లో చొప్పించిన మహాకవులు ప్రసిద్ధులు ఉన్నారుగాని ప్రకృతిలో గాయకుని దర్శించినవారు మాత్రం 'న భూతో న భవిష్యతి' ఇచట సరస్వతి 'సంగీత మపి సాహిత్యమ్ -'

ఇక వర్ణనాంశాల్లో, కవి అనుశీలనానికి జాగ్రద్రూపచిహ్నమైన సరోవరాన్ని, అందుసంచరించే వేదండ తండాన్ని వర్ణించిన యీ క్రిందిపద్యం తార్కాణం:

కొమ్ములఁ జొన్పి యొడ్లు పడ
గ్రుమ్మును కొన్ని జలమ్ము పీల్చి పైఁ
జిమ్మును కొన్ని, తామరలు
చెంగలువల్ పెకలించు కొన్ని, తొం
డమ్ముల నీటిమీఁదను త
టాలున మోదును కొన్ని, పట్టుపం
తమ్ముల నీదుకొన్ని, మెయి
తావులఁ జొక్కును కొన్ని
యేనుఁగుల్ 8

ఇందు గజముల చేష్టలలో కవి అనుశీలనమభివ్యక్తంకావడమే కాక 'ముసుగుల చెరలాడి బెడిదపుటొడ్డుల పాలిముంచు నేనుఁగుపోటుజూచి, 'పద్యముల వ్రాయవలె నన్న తనమనురాశయం కూడ నెఱవేరడం, అతుకుంచక పద్దెములల్లుట అని తాము నవరత్న తరంగిణి పీఠికలో చెప్పిన కవితా లక్షణాన్ని అనుసరించడం జరిగింది! ఇచట గజ చేష్టావర్ణనాంశాన్ని పరిశీలిస్తే భాగవతం గజేంద్ర మోక్షంలోని గోస్తనీపాక సహితమైన గజచేష్టా వర్ణనాంశం పాఠకునికి గుర్తుకురాక మానదు; ఈయన పూర్వకవులలో పోతనను స్తుతించడం మనంగుర్తించినదే కదా:-

పూర్వకవులందఱన్ గడు పూజ్యులందు
భాగవతులయి గోస్తనీ పాకముగను
కృతులొనర్చనధికుల సంస్కృతమున జయ
దేవుఁ దెలుఁగున పోతనన్ దలఁచియెంతు॥ 9

ఈయను శీలనమునకే వర్ణనలో సహజత్వం గల్గిన ఇంటికి దీపమైన ఇల్లాలి సేవనాకాంతులను బాటసారి నోట విస్తరింపజేసిన యీ క్రిందిపద్యంకూడ దృష్టాంతమే.

(సశేషము)

# పుట్టంబుట్టిన తపసి

- కే కిశోరుబాబు, ఎం. ఏ
- కే అశోకబాబు. బి.ఎస్‌సి. (అగ్రి)

విహితఘనాలంకారం
విచిత్ర వర్ణావళీమయస్ఫురణం
శక్రాయుధమివ వక్రం
వల్మీకభువం కవిం వందే
(శ్రీ గోవర్ధనాచార్యులు ఆర్యా సప్తశతి 30)

రచిత ఘనాలంకారము
విచిత్ర వర్ణాళికలితవిస్ఫురణము, వ
క్రచితము, వాల్మీకభవము, శ
క్రచాపమటు వెలుగుచున్న కవిఁ బ్రణుతింతున్.
(తెనిగింపు. శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రి)

శూలికైనను దమ్మిచూలికైనను తలియగరానటువంటి భాగవతపురాణమును రచింపబూనుకొంటిని. నేను వాల్మీకి వ్యాసులంతటి వాగ్మినిగాని మేధానిధినిగాని కాను. అందువలన ఓ బ్రాహ్మీ! దయాంభోనిధీ! నీవు నా జిహ్వాపై నటించి వాక్సౌరసములు చిలికించి నా రసనను, రచనను పూతకృతి చేయురనట్లు అనుగ్రహించుమని బమ్మెర పోతనగారు భారతీదేవిని ప్రార్థించినారు

"పుట్టంబుట్ట" శరంబునన్ మొలవ నం
భోయాన పాత్రంబునన్
నెట్టం జాలను గాలిగొల్వను బురా
ణింపన్ దొరంకొంటి మీ
దెట్టే వెంట జరింతు దత్సరణి నా
కీవమ్మ యోయమ్మ మేల్
పట్టున్ నా కగుమమ్మ నమ్మితిజుమీ
బ్రాహ్మీదయాంభోనిధీ (భాగ 1-)

ఈ సందర్భమున పోతనగారు కవికులశ్రేష్ఠుడగు వాల్మీకిమునీంద్రుని "పుట్టంబుట్ట" అని అచ్చతెనుగులో పేర్కొని చేమోడ్పులు చెల్లించినాడు "తెలుగో కండ" అను మాటను సార్థకపరచునటువంటి కమ్మటిపదముల కూర్పది. పోతనగారుపయోగించిన ఆ పదములకూర్పు తరువాతి కవులందరిని మరువపు మొలకవలె నాకర్షించినది ప్రాచేతసుని పేర్కొనిన సందర్భమున వారందరు పోతనగారుపయోగించిన ఆ "పుట్ట" లోని మట్టి కణములనే యధాతథముగా స్వీకరించి తమ కావ్యగృహములను సజ్జకమొనరించుకొనినారు.

పోతనగారు రచించిన పద్యము శార్దూలము "చిత్తస్పందము అత్యంతము దీప్తములైనప్పుడు అత్యంతము మందములయినప్పుడు శార్దూలవృత్త వినియోగము కనబడుచున్నదని" పాటిబండ మాధవశర్మగారు పేర్కొనినారు (మహాభారతము ఛందఃశిల్పము. పుట 383) చిత్తస్పందము సాధారణముగా కరుణాదులందుండునని భరతముని నిర్వచించినాడు. పోతనగారి పద్యమున ఓ భారతీ నేను మంగుడను. భాగవతరచన కడముట్టునట్లు కడతేర్చు భారము నీదే యను కారుణ్యస్వర మిళితమైన వేడుకోలున చిత్తస్పందము అడుగడుగునను ధ్వనించుచున్నది. "ట్ట" ప్రాస దానిని మరింత నొక్కి చెప్పుచున్నట్లున్నది. శార్దూలమృగముయొక్క శరీరము వంచించుటయును, దీర్ఘీకరించుటయును, పిల్లివలె మెత్తగ సడిలేకుండ నడచుటయును, లేడివలె వడివడిగ పరుగెత్తుటయును, చెంగున దూకుటయును, కొండెక్కుటయును, లోయలోనికి దిగుటయును దేహము అలలుగ కదల్చుటయును వీలుగనుండును దాని శరీరసౌందర్య మద్వితీయమైనది. అట్టి చిత్రప్రకృతి కలదే శార్దూలవిక్రీడిత వృత్తము (శ్రీ సర్వేశాయి తిరుమల రావు శివభారతిదర్శనము పుట 146) పోతనగారి హృదయాంతరాళములోని మొలకూడ ఈ వృత్తమున శార్దూలమృగముయొక్క కాయమువలెనే దీర్ఘీకరింపబడినది. అలలు అలలుగ కదిలింపబడినది. పిల్లివలె మెత్తగ సడిలేకుండ నడిపింపబడినది ధీరమంథరగమనమున సాగి. శార్దూల మిది నీవేతప్ప నితఃపరం బెరుగ మన్నింపదగున్ దీనునిన్ అని విహ్వల నాగేంద్రము విష్ణుమూర్తిని శరణనినట్లుగానే పోతనగారుకూడా వాగధిదేవతను అర్థించినారు. బ్రాహ్మీదయాంభోనిధీ యను సంబోధన కరుణతో కరి మొర పెట్టుకొనినట్లుగానే యున్నది ఆ సంబోధనయందు అనుక్రోశముతో ఆర్ద్రమైన గజబృంహితము పొడకట్టుచున్నది. పోతమనగా కలభశాబకమని అర్థము తాను గజేంద్రునివంటివాడని కాచు భారమంతయు ఆ భగవంతునిదే యని పోతనగారు ఈ వృత్తముద్వారా సూచించినట్లున్నారు అతని పేరుకూడా దానిని సార్థకపరచుచున్నది

"మోక్షపదా, ధారంబై పుండరీకదళ నయన నిజా, గారంబై పరగిన శ్రీరంగముయొక్క మహాత్మ్యమును రచించిన భైరవకవి వాల్మీకిమహర్షిని పేర్కొనిన సందర్భమున పోతనగారి "పుట్ట" మట్టినే ఎరువు తీసుకొనినాడు.

"పుట్టకుబుట్టి" కోమలికి
బుట్టిన ప్రాగవు లాదరించి. చే
బట్టిన గాదె రాఘవప్ర
పాలక ధర్మజకీర్తిచంద్రికల్
నెట్టన సర్వలోకములు
నిండిన విప్పుడు నిందునందులన్
ముట్ట నఖర్వ సర్వ సుఖ
మూలము కావ్యముపోతలంచినన్.
(శ్రీరంగమహాత్మ్యము 1-20)

భైరవుడీపద్యమున కావ్యముయొక్క ఘనతను చక్కగా చాటిచెప్పినాడు. అతడు రచించినది ఉత్పలము. కావ్యముకూడా ఉత్పలమువలె అనగా Sweet Smelling water lily వలె ఆహ్లాదకారి యని అతడు ఈ వృత్తముద్వారా సూచించినాడు. వస్తుగుణప్రకాశిక యందు కలువగుణములను గురించి అది మిక్కిలి తీపిరుచి గలిగియుండునని చలువ చేయుచుండునని మంచిసువాసన గలిగియుండు

వని సౌఖ్యప్రదమైన వని తెలుపబడి యున్నది. (వేటూరి వాసుదేవశాస్త్రి) - వస్తుగుణప్రకాశిక పుట 179) ఉత్తమ కావ్యము గూడా అటువంటిదే యన వచ్చును దానివలన పొందరాని పద్ధతులు లేవు అది ధర్మములలో నుత్తమధర్మము. ఆధర్మము లభించినతడు పెక్కుదైవత యాగములు సుధర్మలో వసించుచుండును. వరదనీరు గంగలోగలిసి పవిత్రమైనటులు కడుదుశ్చరితుండైనను గావ్యాంతరమున జెప్పబడి పావనచరిత్రు డగుచుండును. అందువలననే దానియొక్క మహిమను వివరించుటకు భైరవుడు ఉత్పలము నెన్నుకొనినాడేమో యనిపించుచుండును.

ఎఱ్ఱన గూడ ఒకచోట కావ్యమును కలువతో పోలుస్తూ వర్ణించాడు.

వలల జటాటవిం గుసుమ
వల్లరులై చదలేటి మేటిసా
త్తరుల జనించు క్రొన్నెరువు తండములై
తల జుట్టు పాము మే
నలుపుడు గుప్పసంపు బొర
లై చెలువారు శివేందు చంద్రికల్
నెలయగ బ్రోచు మమ్ము ఖమ
నీషిత కావ్యకళా కుముద్వతిన్
(నృసింహ పురాణము (1-4)

భైరవకవి సమకాలికు డగు నూతనకవి సూరన్న గూడ పోతన గారివలెనే వాల్మీకిని స్తుతించినాడు.

పుట్టంబుట్టి మహానది
బుట్టియు సికతాస్థలమున బుట్టి
జగంబుల్
నెట్టన బొగడగ వెలసిన
యట్టి మహాత్ముల దలంతు నాదిమ
కవులన్
(ధనాభిరామము 1-10)

సూరన రచించిన కందమున ఎనిమిది భగణములున్నవి అందువలన దీనిని భకంద మనవచ్చును. భకందము ఉత్పలమునకు సంక్షిప్త రూపముగా భావించవచ్చునని శ్రీపాటిబండవారు అభిప్రాయ పడినారు. (ఛందశ్శిల్పము పుట 445) ఆదిమ కవులను అర్చించుచుటకు ఉత్పలమునకు సంక్షిప్త రూపమైన కందమునుపయోగించుటలో సూరన గడసరి తనము కన్పించుచున్నది కందమునకు గడ్డ (మట్టిపెల్ల) యని అర్థము పోతనగారు కూర్చిన 'పుట్ట' నుండి దానిని ఒకచిన్న కందమును (మట్టిగడ్డను) గ్రహించి దానిని సొగసైన కందముగా సూరన చక్కగా మలచినాడు.

సరసార్థ బోధ ఘటనా హేలా పరిష్కార శారదనీరూప మని పొగడ బడిన తెనాలిరామకృష్ణుడు పోతనగారి వలెనే వాల్మీకిని వర్ణించినాడు

పుట్టన్ బుట్టెను వేలం
బిట్టపునుపచ్చి పుట్టతేనియచవితో
బుట్టెనన నమృత ముట్టెను
పుట్టనిమువుసర్కవిత్వమును వర్ణింతున్.
(పాండురంగ మాహాత్మ్యము 1-10)

'ట్ట' కార పునరావృత్తితో నట్టాడుచు రామకృష్ణుని పద్యము పుట్టతేనియవలెనే తియ్యగానున్నది. భగణ(6) సగణ (4) సమ్మిశ్రితమైన ఈపద్యము ఉల్లాసముతో ఎగిరి అవలీలగా ఒక్కదుముకు దుముకు లేడిపిల్ల గంతులవలె నున్నది

అలనాటి కవులేకాదు ఈనాటి కవులు గూడ పోతనగారి పలుకు బడిని భక్తితో కన్నులకద్దుకొని గౌరవించినారు. తెనుగు తల్లి లాలాటికా తిలకదీప్తిని ఖండఖండాంతరములలో ప్రకాశింపజేసిన ఆంధ్ర రాజుల చరితను ఉద్ఘాతలూగించు విధముగా సంతరించిన శ్రీమధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారు వేయిపడగల వావుతేనె వంటి విశ్వనాథ వారి కైంకర్యమునకు జేజే లర్పిస్తూ పోతన గారి పుట్టంబుట్ట పదములనే యుపయోగించినారు

అరయగ బుట్ట బుట్టు బుషియాత్ఘుల
బొట్టిన వ్రేళ్ళ ధూళిన
క్కఅపడి దిద్దుకొంటి వలి
కంబున బొట్టుగ విశ్వనాథ! ఆ
త్పరిచితి జిత్ర వర్ణ శరి
భాసి పురందర చాప శిల్ప సుం
దరతరమౌ, శంకరా భరణ
తత్త్వము నీకృతిలో గనం బడున్'
(విద్వాన్ తాటికొండ వేంకటకృష్ణయ్యా మాదివేడు ప్రభాకరరావు విశ్వనాథ సాహితీ దర్శనం. పుట 58)

విశ్వనాథవారి బ్రహ్మమయమూర్తిత్వమును మధునాపంతుల వారీ పద్యమున పిండీకృత మొనరించి చూపించినారు.

మరికొందరు కవులు పోతనగారు కూర్చిన అచ్చతెలుగు 'పుట్టకు' సంస్కృత గంధపుపూత పూసి అలంకరించినారు. వనజాక్షోపము వామలూరు తయున్ అని అల్లసాని పెద్దన (మను చరిత్ర -1-7) వామలూరు భవతాపసు అని పింగళిసూరన (కళాపూర్ణోదయము 1-5) వర్ణించినారు నవవిధాత్రి భూతు వాకు జాతు అని విశ్వనాథవారు (రామాయణ కల్పవృక్షము -38) నాకుజున్ గొలుతు నని కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారు (విక్రమాంకదేవ చరితము 1-26) నుతించినారు

'పోతరాజు గారి పద్యం చెప్పాక తెలుగుసాహిత్యంలో వాల్మీకి ప్రసక్తి వచ్చినప్పుడు చాలామంది కవులు 'పుట్టన్ పుట్టడం చెప్తారు' అని ఆరుద్ర గారు (సమగ్రాంధ్ర సాహిత్యము ఆవ సంపుటము 71) 'పోతన గారు - ఏవేళ పుట్టంబుట్ట శరంబునన్ మొలవ' పద్యము వ్రాసినారో కాని - అనంతరకవు లెప్పరు వాల్మీకిని వర్ణించినా 'పుట్టన్ పుట్ట' పద్యమును వదలిన వారు తక్కువ అని శ్రీరంగాచార్య గారు (శ్రీరంగ మహత్త్వము పీఠిక పుట (XXI) అభిప్రాయ పడినారు. వారిమాటలు వాస్తవములు. అందు నూటికి నూరుపాళ్ళ నిజమున్నది

egd. No H/Rmy-42.

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో కూడిన సమాలోచన తృ ంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు ముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రి పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాద

అడ్రసు :—
సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B. V. & Co , Press, Innispe
(Tyagaraja Nagar) Rajahmundry-1.